ఆంధ్రప్రచారిణీగ్రంథమాలిక. ౭౮.

# బృందావనము.



వేంకటపార్వతీశ్వరకవులు.

సమాలోచనము.

---

దేశభాషాపోషణమునఁ బ్రసిద్ధి గాంచిన శ్రీ కొప్పర్వారి చంద్రారెడ్డిగారి యుదారసాహాయ్యముచే 1911 వ వత్సరమునఁ బ్రతిష్ఠింపఁబడిన యీ ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము పిఠాపురము, ఉయ్యూరు, మునగాల, కపిలేశ్వరపురము, తుని, ఉర్లాము, విజయనగరము, జటప్రోలు, వేంకటగిరి మున్నగు సంస్థానముల ప్రభువులపోషణమునఁ బెంపొంది, భాషాభిమానులగు శ్రీమంతులచే గౌరవింపఁబడి, విజ్ఞులగు విద్యార్థికుల మన్ననలం గాంచి, సకలాంధ్ర మహాజనుల యాదరాభిమానములకుఁ బాత్రమై విలసిల్లుచున్నది. ఇందు గూర్పఁబడిన గ్రంథపుష్పమాలిక నిరంతర మాతృభాషాసేవనమునఁ బావనమై, నిత్యనూతనసౌరభిములతో నలరారుచుఁ గ్రమముగా నిరువదియైదువసంతముల వాల్లభ్యముచే వన్నెఁ గాంచి యున్నది.

ప్రప్రథమమున వసుమతీవసంతమునందు విలాసవికాసామోదముల వెల్లివిరియఁజేసిన యీప్రసవమాలిక యి ట్లిరువదియైదువసంతముల యామోదవిహారలీలానుభవముం గాంచి యేకాంతసేవనమునఁ గావ్యకుసుమావళిం గూర్చుకొనుచు నిప్పటికిఁ బవిమలప్రణయప్రమదావన

మైనబృందావనమున కానందకళావిరాజిత మగు కల్యాణ తోరణము గాఁగలిగినది.

ఇంతకాలమునుండి యాంధ్రసోదరసోదరీమణుల కరకమలముల నలంకరించుచుఁ, గనుదమ్ములఁ దనుపుచు, నంతరంగముల నలరించుచు నెల్లరకు నాత్మీయమై యున్న యీగ్రంథపుష్పకోశముం గూర్చి రాఁగల ధాతసంవత్సర చైత్రమునందు వసంతరజతోత్సవమే చేయవలయునో, రజతవసంతోత్సవమే చేయవలయునో నిర్ణయించి నిర్వహింపవలసిన భార మంతయు నాంధ్రలోకమునందే యున్నది. అట్టి శుభమహోత్సవసమాలోచనమునకును, సమావేశమునకును, గుణగ్రహణపారీణులును, సత్క్రియాదక్షులు నగు నాంధ్రసోదరసోదరీమణుల నందఱ నభినందనపూర్వకముగ నాహ్వానించుచున్నారము.

కాకినాడ,
14-10-35.

వేంకటపార్వతీశ్వరకవులు.



విజ్ఞప్తి.



ఈ గ్రంథనిలయకార్యస్థానము కొలఁదికాలము క్రిందటనే పిఠాపురమునుండి కాకినాడకు మార్పఁబడినది. ప్రస్తుతకాలపరిస్థితుల ననుసరించి మునుపటివలె గ్రంథప్రకటనము చేయుటవలన లభించు నాదాయము ముద్రణ వ్యయములకును, పోస్టుకర్చులకును, దిరిగివచ్చిన వి. పి. దండుగలకే సరిపడకపోవుటచే మాచందాదారులకును మాకునుగూడ ననుకూలముగను, సులభముగను నుండునట్లుగా నింతటినుంచి యీక్రిందివిధముగా గ్రంథములను బ్రకటించుచుండుటకు నిశ్చయించితిమి.

1. గ్రంథములు మునుపటివలె "డెమ్మీసైజు రఫ్‌పేపరు" మీఁదఁ గాక "క్రౌన్‌సైజు ఏంటిక్‌పేపరు" మీఁద జక్కఁగ ముద్రింపించుచుందుము.

2. మునుపటివలె సంవత్సరమున కొకపుస్తకము లేకాక పండ్రెండుగ్రంథములను బంపుదుము.

3. ఇందు నవ్యకావ్యములు, నవలలు, నాటకములు మొదలగు నన్నివిధముల సారస్వతగ్రంథములు నింతటినుండి ప్రకటింపఁబడుచుండును.

4. ఇందు వెలువడు ప్రతిగ్రంథమును మునుపటివలె రు 1-0-0, రు 1-8-0 లు వెలలకుఁగాక రు 0-8-0 ల వెలకు మాత్రమే చౌకగాఁ జదువరుల కందఁజేయుచుందుము.

5. పుస్తకము లన్నియు నెప్పటి కప్పుడు పట్టణములందున్న చందాదారులకు మా ఏజెంట్లమూలమున నందించుచుందుము.

6. అట్టి సౌకర్యము లేనితావులందున్న మాచందాదారులు, ఆఱు పుస్తకములమూల్యము రు 3-0-0 లుగాని, పన్ద్రెండుపుస్తకములమూల్యము రు 6-0-0 లుగాని ముందుగాఁ బంపినచో నెప్పటికప్పుడు "అన్‌రిజస్టర్డు పార్సెల్ పోస్టులో" పుస్తకములు వారి కందఁజేయుచుందుము. అంతేకాని రు 0-8-0 లు విలువగల పుస్తకమునకు పోస్టేజిక్రింద మరి యేడణాలు పెట్టుకొనవలయును గావున వి. పి. గాఁ దెప్పించుకొనుటవలన లాభము లేదు.

7. ఇదివఱకు మాకు ముందుగాఁ జందాలను జెల్లించిన చందాదారులకుఁ బై నిబంధనలప్రకారము పుస్తకములఁ బంపుదుము.

8. క్రొత్తచందాదారులకుఁ గాని, ప్రాఁతచందాదారులకుఁగాని గ్రంథనిలయమునందలి వెనుకటి పుస్తకములు కావలసివచ్చినయెడల వెనుకటి నిబంధనలప్రకారము చందాదారుల వెలలకే గ్రంథములఁ బంపఁగలము.

ప్రకాశకులు.

---

శ్రీశ్రీశ్రీ

శ్రీపీఠికాపురము యువరాజావారగు

శ్రీరాజా

శ్రీ రావు వేంకటమహీపతిగంగాధర

రామారావు బహాదరువారి

పరిణయమహోత్సవశుభసమయమున

శ్రీవారికి

ప్రేమపూర్వకముగా

ఈబృందావనకావ్యము

సమర్పింపఁబడినది.

శ్రీశ్రీశ్రీ

శుక్లసంవత్సరశ్రావణము.

విషయసూచిక.







# అవతారిక.

శ్రీకల్యాణ మయుఁ వరాభయ శయుఁ
శ్రీమూర్తిఁ, జినమూర్తి, లో
కైకారాధ్యు, ననేకజన్మకృత య
త్నాలభ్యసాన్నిధ్యు, సు
శ్లోకు, న్నిశ్చలు, నిత్యు, నిర్మలు, దయా
ళుఁ భక్తబృందావనా
లోకశ్యామలదివ్యమూర్తి మది నా
లోకింతు మశ్రాంతముఁ.

చ. అనిధనవాయువీచికల
యందు విలీనములైన సాధు జీ
వనముల, స్వప్నమోహమయ
వాహినులం బడి చన్న సత్య వ
ర్తనములఁ, గాలగర్భకుహ
రంబుల డిందిన దివ్యమూర్తులన్
మనములఁ బెట్టు భావమయ
మంజులవాణి భజింతు మెంతయున్.

## అవతారిక.

మ. మతవిశ్వాసము, దైవచింతనము, ధ
ర్మజ్ఞానమున్ సాధుస
మ్మతవృత్తజ్ఞత, సంఘసత్కృతియు, నా
త్మశ్రేయమున్, విశ్వరం
జితసౌభాగ్యము, సుప్రబోధము కళా
సిద్ధాంతమున్, సత్యసం
గతవిజ్ఞానము లీనమైనకవితా
గానంబు సామాన్యమే.

ఆ. కవిత గానమందుఁ గవితలో గానంబు
లీన మగుచుఁ గళల నీనుచున్న
సమత గానరాక సంగీతమునకంటెఁ
గవితయందె మమత గలదు మాకు.

సీ. ఆత్మీయసన్మతవ్యాప్తిఁ గోరి తెగించి
సూచీముఖంబులఁ జొరఁగవలెనో
ఆత్మదేశోద్ధరణాపేక్షఁ దపియించి
యసిపత్రవనముల నడలవలెనో
ఆత్మీయసంఘావనాసక్తి భీష్మించి
యనలకుండంబుల మునుఁగవలెనో
ఆత్మగౌరవరక్షణార్థం బుపవసించి
కడలేనికడగండ్లఁ బడఁగవలెనో

కవితఁ గని భావసీమలఁ గాంచుచున్న
దివ్యమూర్తుల పావనదివ్యలీల
దివ్యగీతాస్రవంతులఁ దేర్చికూర్చి
సరసు లుప్పొంగ నిచ్చుటే చాలుననుచు.

ఉ. పావన ధీప్రదీపశిఖ
భారతి కారతిఁ జేసి తత్కళా
సేవనదీక్షఁ గైకొనిన
జీవనముం గని నిత్యవిశ్వసం
భావన సేయుచుణ్ విమల
మానససీమఁ జరించుమాకు బృం
దావనలీల సంస్మృతి ప
థంబునఁ దోఁచి సుఖంబుఁ గూర్చుటణ్.

ఉ. పావనమూర్తి నీశ్వరుని
బమ్మెరపోతన రామరాజుగా
భావన చేసి పాడుకొనె
భాగవతంబును; నల్లె రామభూ
మీవరు సద్గుణావళుల
మేము జగత్ప్రభులీలఁ గాంచి బృం
దావనకావ్యమంకిత మొ
నర్చితి మాతని పెండ్లిపాటగణ్.

అవతారిక.

ఉ. ఆరఘురామ నీతిమధు
    రామృతసారము పిన్ననాఁ డుపా
  హారము చేసి కావ్యకుసు
    మావళిఁ బేరెదపేరుగా నలం
  కారము చేసికొన్నగుణ
    గణ్యని మాయువరాజచంద్రు బ్రం
  దారమణీవివాహకృతి
    నాయకుఁ జేసికొనంగఁ జెల్లదే.

సీ. వేదశాస్త్రపురాణవిజ్ఞానసుమవల్లి
        వరియించి విరియించి వలపు నించి
  ప్రవిమలశ్రుతిపేయనవరసామృతధార
        చిలికించి కులికించి పలుకరించి
  బహురూపజీవస్వభావవైవిధ్యంబు
        సూత్రించి చిత్రించి చూపి తెలిపి
  అనితరసాధారణానందసామ్రాజ్య
        మేలించి లాలించి మేలుకొలిపి
  పలుకు చెదరకుండ భావ మొత్తకయుండ
  నెడఁద గందకుండ హితము దెలుపు
  కవిత నాదరించు కళ్యాణమూర్తి యీ
  రామమూర్తి మాకుఁ బ్రేమమూర్తి.

ఆశీర్వాదము.

శ్రీలీల హృదయనీరేరుహాంబునఁ దోఁచి
యామోదరసముచే నత్తమిల్లి
ధర్మానుమతదోహదమ్ముచేఁ జిగిరించి
విజ్ఞానకళలచే విస్తరిల్లి
సత్యతేజంబుచే సౌందర్యమును గాంచి
మోహనద్యుతులచే మొగ్గదొడిగి
సుకృతిసంపదలచే వికసనంబును గాంచి
కల్యాణకలన సాఫల్యమంది
నవనవానంద బృందావనమ్ములోని
త్రిభువనావనపావనప్రేమవల్లి
పెరటికల్పకవల్లియై పెంపు మీఱి
తనుపుఁ గాత మాయువరాజదంపతులను.

సీ. కల్పప్రసిద్ధలింగం బని యారాధ్యులై
యభిషేకార్థులైనఁ గాని
అమృతమోహనవిగ్రహం బని వైష్ణవు
లై యుత్సవాసక్తులైనఁ గాని
ప్రకృతిశక్తిస్వరూపం బని శాక్తేయు
లై మంత్రజపసిద్ధులైనఁ గాని
సదమలబ్రహ్మతేజం బని వేదాంతు
లై ధ్యానతన్మయులైనఁ గాని

## ఆశీర్వాదము.

భేదబుద్ధి లేక బిడ్డలఁ దండ్రియ
ట్లొక్కలాగె కరుణ నోముప్రభుఁడు
ప్రీతి మీఱఁ గూర్చుఁగాత మాయువరాజ
దంపతుల కభీష్టసంపదలను.

సీ. వ్యాసేతిహాసకథాసుధార్ణవవీచి
కాలోలడోలల నోలలాడి
నారదమధురవీణాగానవల్లీప్ర
సూనసౌరభములఁ జూఱలాడి
రామానుజప్రబోధామోదచంద్రికా
ప్రవిమలప్రభలలోఁ బ్రతిఫలించి
జయదేవసుకవితాసారగీతానంద
తరళభావములలోఁ దాండవించి
అమృతకళ నించుభువనకల్యాణమూర్తి
ప్రణయమయమూర్తి యాపరబ్రహ్మమూర్తి
యాయురారోగ్య భోగభాగ్యములఁ గూర్చి
తనుపుఁగాత మాయువరాజదంపతులను.



శ్రీరస్తు.

# బృందావనము.




మంతుండు, దయామయుండు భువన
క్షేమంకరుం డుల్లసత్
ప్రేమానందుఁడు, మంగళప్రభవుఁ డా
బృందాలతావేల్లిత
శ్రీమందారుఁడు సంశ్రితావనుఁడు రో
చిష్ణుండు, కృష్ణుండు మా
రామారాయని కాపుఁడై యభిమతా
ర్థంబుల్ ప్రసాదించుతన్. ౧

సీ. శ్రీకరాంబుజ చంచరీక నాదములలో
వల్లకీగీతముల్ పల్లవింప
సురుచిరాలంకార వరమణిప్రభలలో
ఘనసువర్ణద్యుతుల్ కందళింప
సదమలాననచంద్ర సౌభాగ్యకళలలో
విజ్ఞానకిరణముల్ విస్తరింపఁ
బరమపావనదివ్య పదవైభవములలో
సకలేప్సితార్థముల్ సంక్రమింప

బృందావనము.

నెలమి శ్రీసతీవాక్సతుల్ కలసి మెలసి
కరుణఁ జేదోడు వాదోడుగా మెలంగ
వెలయుఁగదవయ్య! తండ్రితాతలను బోలి
రావు సూర్యగంగాధరరామరాయ!

సీ. అలమికోవే యింక నాశాంతరము లెల్లఁ
గమనీయసుకవితా కల్పలతలె
అనుకోవే యింక భూనభోంతరమెల్ల
బహువర్ణమయ శబ్దపల్లవములె
క్రమ్ముకోవే యింకఁ గడలేని కడలెల్ల
సరసప్రసవభావసౌరభములె
విలుచుకోవే యింక విశ్వమండల మెల్ల
బరమార్థపరిపాక ఫలరసములె
భువనకల్యాణమూర్తి మాధవుఁడ వీవు
సురుచిరానందకవిసుధాకరుల మేము
కువలయామోదమున కింకఁ గొదవ గలదె
రాజనిభ తేజ! యువరాజ! రామరాజ!

క. ప్రేమమయుండవు శ్రుతిహిత
కాముఁడ, వఖిలార్థధర్మఘనగుణసుమనో
దాముఁడవు, సకలసుకళా
ధాముఁడ వీ వచలభక్తిధాముఁడ వగుటన్.

బృందావనము.

క. చెలువకుఁ జెలువ్వునియెడలం
గల ప్రేమం బభవుచరణకంజంబుల ని
చ్చలుఁ గొల్చు భక్తుభక్తిగ
వెలసిన యొకసుకృతి విన్నవింతుము నీకుఁ. గి.



౧. అంకురారోపణము.

—౦—

శ్రీలాలిత నవగుణమణి
జాలా! యణిమాది సిద్ధిసాధన శుభసం
శీలా! నిర్మలకీర్తిమ
రాళా! కల్యాణరామరాయనృపాలా!

సీ. ఏడుదీవులనేల యెల్ల నేలినవాఁడు
మూఁడుశక్తుల మించి మొనయువాఁడు
ఏడుసంతానంబు లెలమిఁ గాంచినవాఁడు
నాలు గుపాయముల్ నడపువాఁడు
ఏడుగోడుల కెందు నెడ మింత యిడనివాఁ
డైదుతంత్రంబుల నరయువాఁడు
ఏడుసంద్రముల నోలాడుభాగ్యంబువాఁ
డాఱుశాస్త్రములఁ బేరైనవాఁడు
అరయ నేడేడులోకాలయందుఁ గూడఁ
దన కెదురులేని నెఱదొరతనమువాఁడు
సత్యశౌచదయాధర్మ సారమూర్తి
సాధునుతకీర్తి కేదారచక్రవర్తి.

ఉ. ఆతని నెన్ని యెన్నవలె
    నవ్వల ధీవిభవాత్మ సిద్ధులన్
ధాతను, మీనకేతనుని
    తాతను, రాజతశైలనేత; న
ట్లాతత భోగ భాగ్య విజ
    యంబుల నింద్రుఁ, గుబేరు, ధర్ము; వి
ఖ్యాతబలప్రతాపశుభ
    కాంతుల వాయుదినేంద్రచంద్రులన్. ౮

గీ. సవనతతిచేతఁ దనియు నిర్జరులచేత
నాశ్రయముచేత నెగడు దీనాళిచేతఁ
బాలనముచేత విలసిల్లు ప్రజలచేత
నవనియే స్వర్గ మయ్యె నయ్యధిపుచేత. ౯

గీ. అతనికొలువున నిలిపె జనార్దనుండు
చక్రమును భూమిచక్రరక్షణముకొఱకు;
నవనిధుల సన్నిధులఁ జేసె శివసఖుండు
దాననిధి యైన యతనివిత్తంబుకొఱకు. ౧౦

గీ. ప్రజలు సంప్రీతి నొసఁగు కరమ్మువలనఁ
గలిమియును, దాన దానభోగములవలన
నెలమియును రాజ్య మెల్లెడ నెలవుకొనియె
మనునిభుం డైనయతని పాలనమువలన. ౧౧

బృందావనము.

చ. కులమునకుఁ, గుణంబున, క
    కుంఠితశక్తికి, దైవభక్తికిన్
జెలువునకుఁ, బ్రశాంతికిఁ బ్ర
    సిద్ధికి, బుద్ధికి, వాగ్విశుద్ధికిన్
గలిమికి, ధర్మపద్ధతికి,
    ఖ్యాతికి, నీతికి, నిత్యసత్క్రియా
కలనకు నీడు జోడు త్రిజ
    గంబుల లేఁ డల భూమిజానికిన్.

సీ. చిత్తంబు మాధవశ్రీపాదములయందు
        విజ్ఞాన మాత్మవివేకమందు
    అధికార మఖిలధర్మావనంబునయందు
        సంపత్తి దీనపోషణమునందు
    నిత్యప్రచారంబు సత్యమార్గమునందు
        నిలుకడ సాధుసాన్నిధ్యమందు
    దుర్వారదోశ్శక్తి దుష్టశిక్షణమందు
        దాక్షిణ్య మఖిలభూతంబులందుఁ
    దేజరిలుచుండఁగా నేడుదీవులందు
    నాయురారోగ్యభోగభాగ్యాదికములు
    వర్ధిలుచునుండె నమ్మహీవలయవిభుని
    పాలనమునందుఁ బెంపొందు ప్రజలయందు.

చ. అతఁ డొనరించుయాగముల
కాతఁ డొసంగుధరాహిరణ్యదా
నతతుల, కాతఁ డిచ్చుశర
ణంబుల, కాతఁడు సత్కరించు పం
డితకవిగాయకాదులకు
నిచ్చులు నాతఁడు పూజసేయు దే
వతలకు లెక్క వ్రాసికొను
వారికె తీరిక లే దొకప్పుడున్. ౧౪

ఉ. బాటలనీడలందుఁ, జలి
పందిళులందుఁ, దటాకదీర్ఘికా
వాటములందు, రుచ్యఫల
వంతములై నవనందనంబులౌ
తోఁటలయందు, సత్రములఁ
దోరపుఁగోవెలలందు నెందు న
మ్మేటిగుణానుకీర్తనమె
మిన్నులు ముట్టుచు నుండు నెప్పుడున్. ౧౫

క. పరదారహరులు, పరధన
పరతంత్రులు, పరులు, నిత్యపరదూషకులున్
బరసేవాపరు లాప్రభు
పరిపాలనమందుఁ గానఁబడ రొకరైనన్. ౧౬

గీ. కలిమి గలవారివలెనె పేదలును గూడ
నలరి యాహారశయ్యావిహారగతుల
నొక్కలాగె సుఖంబుల నొందుచుంద్రు
సర్వసముఁడైన యతనిరక్షణమువలన.

ఆ. వానియానతులకు వంపనితలవారు
వాని పోషణమున లేనివారు
వానికొఱకుఁ బ్రాణమే నొసంగనివారు
వానికీర్తి విననివారు లేరు.

✓గీ. తనకు సరివారిలోన నుత్తముఁడై యెనఁ
దను మిగులువారు లేనట్టిధన్యుఁడైన
మానవుం డయి పుట్టినవాని కెపుడొ
యేదియో లోప ముండక పోదు గాదె.

✓ఉ. ఎంతయొరాజ్య ముండి, మణి
హేమము లుండి, బలంబు లుండి, సా
మంతులసఖ్య ముండి, ప్రభు
మంత్రసముత్సవశక్తు లుండి, శు
ద్ధాంతజనంబు లుండి, మణి
ధామము లుండి సమస్త ముండియున్
సంతతి లేక యన్నియు వి
చారమె కొల్పె నృపాలమౌళికిన్.

సీ. కనకపంజర మెంతకనుపండువై యున్నఁ
జెలువందఁగలదె రాచిలుక లేక
నెత్తమ్మికొల నెంతనిర్మలంబై యున్న
నలరారఁగలదె రాయంచ లేక
ఆమనిశ్రీ యెంతయామోదమై యున్న
రేకెత్తఁగలదె రారేక లేక
బంగారునగ యెంతసింగారమై యున్న
రాణింపఁగలదె రారవ్వ లేక
సరికి సరి లేక సిరులకుఁ దఱుగు లేక
యమరభోగవైభవముల కంతు లేక
ధన్యతములైన యారాజదంపతులకు
నంతయుఁ గొఱంతయే యయ్యె సంతు లేక. ౨౧

ఉ. ఆనరనాథచంద్రుఁడు ని
రంతరనిశ్చలభక్తియుక్తి సం
తానముఁ గోరి కోరి కు
లదైవతకోటులఁ గొల్చి కొల్చి యా
ధానములున్, వ్రతంబులును,
దానము లెన్నియొ చేసి భూతసం
తానముఁ దన్పుచుండఁగ జ
నార్దనుసత్కృపఁ గొన్నినాళ్లకున్. ౨౨

ఆ. అతనిపుణ్యఫలరసాభిషేచనమున
నతనిసుకృతదోహదాదికమున
నతనిప్రేమవల్లి కానందకళికగా
నవతరించె నొక్కయాఁడుబిడ్డ.

క. అన్నిసుఁగు పుట్టినంతనె
కన్నప్రజలసమ్మదాశ్రుకణనిర్ఝరులున్
మిన్నుల విరులున్ దల్లుల
చన్నుగవలఁ బాలగుమ్మసరులున్ గురిసెన్.

మ. లలితోద్యానము శైశిరాంతమధు
లీలాలోల మైనట్లు, ని
ర్మలకాసారము గ్రీష్మముక్తనవవ
ర్షాసక్త మైనట్టు, ల
బ్జలతాకుంజము వార్షికాంతికశర
త్సంపన్న మైనట్లు, మం
గళధామం బయి రాజధాని యలరెన్
గల్యాణసంపూర్ణమై.

ఉ. అన్నరనాథమౌళి భవ
మందినసత్ఫల మంది పార్వతిం
గన్నహిమాచలేశ్వరుని
కైవడి రాఘవు దేవి జానకిం
గన్నకుశధ్వజాత్మజుర
కంబున నిండిన లోకమాత సం
పన్నిధిఁ గన్నపాల్కడలి
భంగిఁ బ్రమోదరసాంతరంగుఁడై. ౨౬

క. గోదానమణీదానమ
హీదానంబుల మహామహీదేవాళీ
ర్వాదంబుల భేరీముఖ
వాదంబులఁ బుత్రికోత్సవము సాగించెన్. ౨౭

గీ. అతిశుభస్థితి గ్రహబృంద మలరువేళ
దివిజబృందంబు దయఁ బ్రసాదించువేళ
మనుజపతి బంధుగురుబృందమతముఁబట్టి
బృంద యని ముద్దుపట్టికిఁ బేరుపెట్టె. ౨౮



౨. అమృతసేచనము.

శ్రీమహిమాకర శుభతే
జోమయ నిత్యప్రసన్నసుందరవదనా
శ్రీమహిపతిగంగాధర
రామప్రభుపౌత్రి సూర్యరాణ్మణిపుత్రీ!

క. తనయ యగుబృంద చల్లని
కనుఁగోనల కమృతసురభికర్పూరకళాం
జనమై మేనికి హరిచం
దనమై తనియించుచుండెఁ దల్లిఁ దండ్రిన్.

చ. జిలిబిలికుందనంపుఁబస
చిప్పిలుమేల్ రతనాలతూఁగుటు
య్యెలపయి నంచఱెక్కల లోల
యుంచినమెత్తనిమెత్తఁ జంద్రకాం
తులఁ దులకించుదువ్వలువ
తోరపుసెజ్జ ఘటించి బాలికన్
మెలపున నూఁచి కూర్చెదరు
నిద్రకు దాదులు జోలపాడుచున్.

క. ఎన్నిటఁ బోరుదుగని యా
చిన్నినిసుఁగు కృష్ణలీల చెలువలు పాడన్
దన్నెఱుఁగక కన్నెఱుఁగక
చన్నెఱుఁగక నిదురవోవు సమ్మోదమునన్. ౩౨

క. తల్లి శుభవల్లి మది రం
జిల్ల రమం గొలుచునంతసే పలరుచు నా
పిల్ల గనుఁ గాని పాలకు
నల్లరి గావింప దెంత యాఁకలి యైనన్. ౩౩

క. అరచేతినిమ్మపండై
శిరమున గడివోనివన్నెచిన్నెలపూవై
నిరతము నుడిగపుఁదరుణుల
వరవుడములఁ జిన్నిపాప వర్ధిలుచుండెన్. ౩౪

క. పిడికిళ్లు రాజనందన
విడిచెదునెడ నగరినాల్గువీథులయందున్
గుడుములు రవయుంగరములు
పడఁతుల కింటింటివరుసఁ బంచిరి దాదుల్. ౩౫

క. వెడవెడఁ దడఁబడి గుమ్మపు
గడపల కెగఁ బ్రాఁకువేళ గారెలు బూరెల్
బుడుతలకుఁ బంచిపెట్టిరి
గడపల కడపలను బైఁడికాసులతోడన్. ౩౬

బృందావనము.

క. పుడమిపతితనయ చిడిముడి
పడుచుం దూలుచును నిలువఁబడి ముంగిళ్ల౯
నడయాడువేళ నైదువ
లడుగులు వెట్టించి రెలమి నరిసెలమీఁద౯. ౨

క. రతనాలబొమ్మ, బంగరు
లత, మించులకరవు, వెన్నెలలగుత్తియొ నా
నతివలు సింగారింపను
క్షితిపతిసుత గడియ కొక్కసిరిఁ గనుచుండె౯. 3

క. సరిపాపలు పలుకాడెడు
తఱి మున్నుం "దత్త యత్త తాతా" యనఁగా
నరనాథతనయ తొలుతనె
"హరిహరి"యనఁ దొడఁగె నెంతొ యబ్రము గాఁగ

గీ. "వాసుదేవా జగచ్చక్రవర్తి" యనుచు
"ఆర్తరక్షా జగన్నాథమూర్తి" యనుచుఁ
బంజరశుకంబు పలికెడుపలుకుబడికి
బుడుత చెవి యొగ్గుఁ దన కేమి బోధ యగునొ! ౪౦

బృందావనము.

సీ. దిన మొక్కకళ మించి తేటవెన్నెల గాయు
నిద్దంపునెలరేకనీటు గాంచి
గడె కొక్కమెఱుఁ గెక్కి కనువిందు గావించు
మఱిపంపునునుఁజుక్కయొఱపు గాంచి
సన కొక్కజిగి నించి నవకంబు వెలయించు
లలితంపుఁబువ్వుదీవపొలుపు గాంచి
తెర కొక్కపస గూర్చి పరిమళంబులఁ దేర్చు
సరసంపువిరిమొగ్గసౌరు గాంచి
అంతిపురము మెఱయ నానాఁటి కానాఁడు
కళలు వెలయ నూత్నకాంతు లొలయ
నెల్లవారికనుల కల్లారుముద్దుగాఁ
బెంపు మీఱ బృంద పెరుఁగుచుండె. ౪౧

క. వరుసగ నక్కుమారి నడు
వ న్నడువ న్మెలమెల్ల నేర్చి సం
బరమునఁ దోడివారికడఁ
బాటల నాటల నేర్చి కూరిముల్
నెరయఁగఁ దల్లిదండ్రులకు
నీటులు గోటులు సూప నేర్చి తా
నెఱిఁగి నుతింప నేర్చె నయి
దేఁడులయీడుననే జనార్దనుఁ. ౪౨

బృందావనము.

సీ. తెల్లవాఱక ముందె యల్లనల్లన లేచి
తల్లిదండ్రులకు వందనము చేయు
నావెన్కఁ బూజాగృహంబుఁ జేరఁగఁ బోయి
శ్రీనాథులకుఁ బ్రదక్షిణ మొనర్చుఁ
దరువాత బంధువుల్ దాదులు లాలింప
సరసఁ గూర్చుండి ముచ్చటలఁ దేల్చు
నామీఁదఁ దనకుఁ దోయమువారిఁ గవగూడి
యారామసీమల నాటలాడు
గురులు వచ్చినపిమ్మటఁ గొంతసేపు
శ్రద్ధయును భక్తియును మీఱఁ జదువు నేర్చుఁ
గాని యూరక కాలంబు గడవనీదు
చారుమతి యైనయల్లకేదారకన్య. ౮౩

సీ. మంచిక్రొవ్విరు లేరి మగువల కందించు
శ్రీలక్ష్మిఁ గైసేయుమాలికలకుఁ
బచ్చకర్పూరంబుఁ బడఁతుల కందించుఁ
గమలనాభుని కిచ్చుకలపమునకు
చలువగొజ్జఁగినీరు చెలువల కందించు
జలధికన్యకఁ దేల్చుజలకమునకు
అగురుగందపుబిళ్ల లతివల కందించు
శ్రీపతి కర్పించుధూపమునకు

తల్లిదండ్రు లయ్యాదిమదంపతులకు
మంగళారాత్రికము లిచ్చి మధురభక్ష్య
పాయసము లారగింపఁగాఁజేయువేళ
బృంద యానందవిస్మృతి నందుచుండు. ౪౪

క. పుట్టకమును పుట్టినదో
పుట్టినతరువాత బుద్ధిఁ బుట్టినదో రా
పట్టికి శ్రీహరిపదముల
పట్టు విడువనట్టిభక్తి; భాగ్యముగాదే! ౪౫

క. ఈలీల మెఱయుబాలిక
కేలం గే ల్గీలుకొలిపి కేదారమహీ
పాలుం డొకనాఁ డుపవన
కేళీమణిమందిరంబు కెలనఁ దిరుగుచోన్. ౪౬

క. తల్లియు దాదులు జనకుని
యుల్ల మలర మెలఁగుబృంద నుత్సాహము సం
ధిల్లఁ గనుంగొనుచుండిరి
జల్లున నానందబాష్పజలము గురియుచున్. ౪౭

గీ. అమ్మహీమండలేశ్వరుం డాత్మజాత
కాదిలక్ష్మిస్వయంవరామోదలీల
చిన్నికథగాఁ బ్రియంబుగాఁ జెప్పుచుండ
నలరి యాబాల వినుచుండె సంతలోన. ౪౮

క. పార్వణరజనీకాంతుం
డుర్వి నవతరించినట్టు లురుకాంతి చెసల్
పర్వ నరుదెంచి సన్ముని
దుర్వాసుం డెట్టయెదుటఁ దోఁచె విభునకున్. ౪౯

ఉ. తోఁచిన జూచి సంభ్రమము
తో నెదురై చని తోడితెచ్చి ధ
ర్మాచరణం బొనర్చి వసు
ధాధిపుఁ డమ్మునిసార్వభౌము హే
మాచలకాంతిమన్మణిగృ
హంబునఁ గాంచనపీఠిఁ జేర్చి యెం
తో చనవుం బ్రియంబుఁ బరి
తోషము భక్తియు నివ్వటిల్లఁగన్. ౫౦

క. సేవించుచుండ నమ్ముని
దీవించుచు రాకుమారిదెసఁ గని యేమో
భావించి మందహాసము
గావించుచుఁ బలికె భూమికాంతునితోడన్. ౫౧

క. మాన్యుండ వఖిలనృపమూ
ర్ధన్యుండ వనేకజన్మధర్మఫలాప్తిన్
ధన్యుండ వైతి వీ వి
క్కన్యఁ దనూజన్యగాఁగఁ గన్నకతమునన్. ౫౨

క. కమలనిభచరణ కోమల
కమలకుసుమపాణి, కనకకమలానన, యి
క్కమలదళనయన నిజముగఁ
గమలామలగేహ మైనకమలయె సుమ్మీ. ౫౩

క. అని యుగ్గడించి యభివం
దనముం గావించురాజతనయం గృప దీ
వన లిచ్చి బుజ్జగించుచు
మునివరుఁడు ప్రసన్నుఁడై ప్రమోదము మీఱన్. ౫౪

శా. బాలా యియ్యది మంగళప్రదము సౌ
భాగ్యాయురారోగ్యస
చ్ఛీలానందసుఖప్రదం బనుచు ల
క్ష్మీసంతతారాధ్యమౌ
సాలగ్రామమనోహరంబయిన కృ
ష్ణస్వామిసన్మూర్తి భూ
పాలగ్రామణిపుత్రి కిచ్చి దయ సం
భావించి సంతుష్టుఁడై. ౫౫

బృందావనము.

క. గోలోకంబునఁ గలగో
పాలమహాదేవుఁ గొలుచుపనిగాఁ గొని యీ
లీల నరుదెంచి నిను నీ
బాలారత్నంబుఁ జూచుభాగ్యముఁ గంటిన్. ౫౬

గీ. అధిప ! నీకు శుభావాప్తి యగునుగాక
యాత్మజాతకుఁ గల్యాణ మగునుగాక
యఖిలభూప్రజ కానంద మగునుగాక
యనుచు దీవించి చనియె నమ్మునివరుఁడు. ౫౭



3. ఆర్ద్రిపల్లవము.

శ్రీవేదవతీప్రియసం
భావితగుణభద్రవిభవభాస్వద్గరిమా
భావజసుందరరూపా
రావుకులమణిప్రదీప రామమహీపా ! ౫౮

ఆ. సరసమధురమైన సంయమీంద్రునిపల్కు
తలఁచుకొలఁది నొడలు పులకరింపఁ
దనకులంబుఁ దనుపుతనుజాతఁ గని రాజు
ముదము మీఱ మిన్ను ముట్టుచుండె. ౫౯

క. సంతోషంబున నీవృ
త్తాంతం బంతయును వీనుదనియింపఁగ శు
ద్ధాంతజనంబు ప్రమోదా
నంతామృతవార్ధి నోలలాడఁదొడంగెన్. ౬౦

ఉ. అమ్మునినాథచంద్రుఁడు ద
యామతి నిచ్చినదివ్యమూర్తి యం
దమ్మును జూచి చూచి ప్రమ
దమ్ము మనమ్మునఁ గ్రమ్మ సోగకన్
దమ్ముల నద్దుకొంచుఁ జని
తల్లికి సంతయుఁ దెల్పి పొంగుబ్బం
దమ్మను మెచ్చుకోఁగఁడఁగి
రంతిపురంబున కాంత లందఱున్. ౬౧

బృందావనము.

క. ఆనాఁడు మొదలుగా స
న్మానంబులు గానములును మాటలు నాటల్
ధ్యానములు బొమ్మతోనే
నానాఁటికి మించె భూమినాథాత్మజకున్. ౬౨

క. నడచు నెడ నిలుచు నెడలన్
గుడుచు నెడల ముడుచు నెడలఁ గూర్కొను నెడలన్
గడెయైన మఱచియైనన్
విడువదు రాకన్నె కృష్ణవిగ్రహ మెపుడున్. ౬౩

క. ఉంగ లిడ నిచ్చుఁ, గృష్ణుని
సింగారింపంగ నిచ్చుఁ, జేతుల కిచ్చున్
బొంగళ్లు వెట్ట నిచ్చును
సంగడిఁ గొనిపోవఁగా నొసంగ దెవరికిన్. ౬౪

ఉ. కుమ్మరిసారె, లచ్చనలు
కుందెనకాళులు, త్రొక్కుబిళ్లలున్
జిమ్మనగ్రోవు లోలలును
జీరుకుబండలు నాడుఁ గాని యే
యమ్మకు నల్లుఁ డౌనో తన
యాసలకృష్ణుఁ డటంచు బృంద తా
బొమ్మలపెండ్లియాటలకుఁ
బోవదు నెచ్చెలు లెంత పిల్చినన్. ౬౫

గీ. అలరి దాఁగిలిమూఁతల నాడువేళఁ
చెలువ కను మూసి పేరులు చెప్పుమన్న
హరిణి శారద మాధవి యనుట మఱచి
చిన్నికృష్ణమ్మ యని చెప్పెఁ జెలులు నవ్వ. ౬౬

క. తనజన్మదినోత్సవముల
మనమున నిడి చెలులఁ గూర్చి మందిరమునఁ గృ
ష్ణునిపుట్టినసుదినం బిది
యని పండ్లును బాలు పీడియంబు లొసంగున్. ౬౭

గీ. పాడుకొననీయవోయి నాబాలకృష్ణ
చెప్పుకొననీయవోయి నాచిన్నికృష్ణ
మ్రొక్కుకొననీయవోయి నాముద్దుకృష్ణ
యనుచు నాబాల యమ్మూర్తి నడుగుచుండు. ౬౮

క. తల గడుగవలయు నేమో
కలపంబులు మేన నలఁదఁగావలె నేమో
తిలక మిడవలయు నేమో
తెలుపఁడు తనకృష్ణుఁ డనుచుఁ దెలువ కలంగున్. ౬౯

సీ. పలురకంబులవిరుల్ గలిపి పింఛము దీర్చి
కమ్మగన్నెరుకికీటమ్ము వెట్టి
గేదంగిరేకుల గీరునామము దిద్ది
కలువక్రొవ్విరిరేకఁ దిలకముంచి

వనమాలికను గళంబునఁ గూర్చి యురమున
మందారకుసుమంపుమణి గదించి
చేమంతిరేకుల చేలంబు సవరించి
తమ్మితూడులపట్టుదట్టి గట్టి
చిత్రమునఁ జూచి విరులఁ గై చేసి చేసి
మురిసి శ్రీమూర్తి మాధవమూర్తిఁ జేసి
కదలి రమ్మోయి పూలరంగా యటంచుఁ
బిలుచుచును బృంద తనలోనె కులుకుచుండు. ౭౹

క. విలువగలనగలు గానీ
వలిపమ్ములు గాని యాటవస్తులు గానీ
ఫలములు గానీ తనసొ
మ్ములు కృష్ణుని కిచ్చి కాని ముట్టదు తొలుతన్. ౭౸

సీ. ఆకలిఁ గొంటి వేమో కృష్ణ యని పోయి
దివ్యమృష్టాన్నముల్ తెచ్చి పెట్టు
దాహ మౌచున్న దేమో హరీ యని పిల్చి
యమృతపానీయంబు నంది యిచ్చు
ఉక్కగా నున్న దేమో కృష్ణ యని లేచి
ప్రసవచామరము చేపట్టి విసరు
ఉబుసు పోకున్న దేమో హరీ యని చేరి
కర్ణపేయము లైనకథలు చెప్పు

గోపబాలుని కెపు డేమి కోర్కి యగునొ
తెలియఁగాలేక తనకుఁ గావలసినవియె
కోరి యాతని కర్పించుకొనుచు నుండు
బృంద కాకృష్ణుపై నెంతప్రేమ గలదొ. ౭౨

క. బాలికసుద్దులు బుద్దులు,
పోలికలుం, గేలికలును, బొందులు, విందుల్,
లీలాగతులున్ సతతము
నాలోకించుచును బితరు లానందమునన్. ౭౩

క. తమపుణ్యము ఫలియించెన్
దమకోర్కులు పల్లవించెఁ దమజపతపముల్
తమనోములు సిద్ధించెను
దమకులము తరించె ననుచుఁ దనియుదు రెదలన్. ౭౪



౪ అగ్రవిస్తరము.

శ్రీరావు సూర్య రాట్సుకు
మారా సూర్యాగ్రజన్మ మహితోదారా
సారప్రాభవగరిమా
చారుకళామహిమ దానసత్కారలఘిమా! ౧

గీ. బాల యీలీలఁ బ్రేమాలవాల యగుచు
మొగ్గప్రాయంబు క్రమముగా మురువుమించి
యలరుఁబ్రాయంపుఁగళలతో నందగింప
భువనమోహనకల్యాణమూర్తి యయ్యె. ౧౦

క. పరువంబు, సొగసు, జిగియున్,
బరిమళముం గాంచి మించుప్రసవముభంగిన్
దరుణీమణి రాజాంతః
పురమున కామోదమున్ బ్రమోదము నిడుచున్. ౧౧

సీ. సకలశాస్త్రపురాణ సరసప్రబంధముల్
పఠియింప నెఱుఁగఁ దెల్పంగ నేర్చి
సమభావరాగతాళము లొప్ప గానంబు
సేయ, మెచ్చంగ, రంజింప నేర్చి

కమనీయనవభావ కవితామృతరసంబు
నింప, గ్రహింప, నందింప నేర్చి
ధర్మార్థకామపద్ధతియు ముక్తివిధంబు
దెలుప, సాధింప, బోధింప నేర్చి
దేవగురుజనపూజనాదిక మెఱింగి
వివిధవర్ణాశ్రమాచారవిధు లెఱింగి
సకలభూతహితక్రియాచరణ మెఱిఁగి
బృంద సర్వంబు నెఱిఁగి వర్తింప నేర్చె. ౭౮

క. మతికిన్ బ్రహ్మాణి, సము
న్నతికిన్ సరసీజపాణి, నవనవశుభ వి
స్తృతికిన్ శర్వాణియె నాఁ
జతుర యగుచు నక్కుమారి సన్నుతి కెక్కెన్. ౭౯

క. కన్నపుడె తోఁచి మునికృపఁ
గన్నప్పటినుండి పొదలి క్రమముగ మూర్తిం
గన్నకొలఁది మిన్నందుచుఁ
గన్నియ సద్భక్తి వెలయఁ గడఁగె వయసుతోన్. ౮౦

క. చెలువున కలరుం బ్రాయము
కులశీలంబులకు సాధుగుణవర్తనముల్
పలుకులకుఁ జదువులున్, సాం
పులు నింపులు గళలు నింపఁ బొలఁతి క్రమముగన్.

క. చిన్నారి బొమ్మలోనం
గన్నారం గన్నకృష్ణుకళలకు శ్రుతులం
జెన్నారుచున్న వెన్నుని
విన్నాణంబులకుఁ బొంకు వెదకఁ దొడంగెన్.

సీ. వేదముల్ సాధించి విధి కొసంగినమూర్తి
వెన్నున గిరి నిల్పుకొన్నమూర్తి
క్రుంగినభువి దంష్ట్రఁ గూర్చి యెత్తినమూర్తి
బాలభక్తుని కడ్డుపడినమూర్తి
కులుచరై మిన్నందుకొని వెలింగినమూర్తి
ధర యెల్ల ముని కిడ్డ ధర్మమూర్తి
జనరంజనంబుగా జగము నేలినమూర్తి
గుప్తగీతలను వాకొనినమూర్తి
సగుణమూర్తి, నిర్గుణమూర్తి, సత్యమూర్తి
విశ్వమూర్తి, విరాణ్మూర్తి, వేదమూర్తి
మొదలుగాఁగల నిఖిలేశుమూర్తు లెల్లఁ
జెలువ శ్రీమూర్తిలోనె వీక్షింపఁగలిగె.

గీ. అంతరంగప్రమోదామృతాంబునిధిని
బ్రణయహృదయసరోజతల్పంబుమీఁదఁ
జిన్నికృష్ణునిఁ బవళింపఁజేసి భావ
గీతములఁ బాడి జోక్కి జోక్కింప నేర్చె.

క. కన్నియ కేలి మేలినగ
గా, మదిగూరుచు చిన్ని పాపగాఁ,
గన్నులఁ దన్పు బాలకుఁడు
గాఁ, గవపీడని యీడుజోడుగాఁ
దన్నెడఁబాయ కాడుకొను
దగ్గఱిచుట్టముగాఁ, బ్రియుండుగా,
వెన్నుఁడు వేల్పుగాఁ దోడఁగె
వెల్వల లోపల నవ్వేలందికిఁ. రాగి

1. కుసుమపత్రంబులఁ గుంకుమాక్షతములఁ
బూజించి పూజించి పులకరించు
దీపధూపంబుల దివ్యాన్నరసముల
నర్పించి యర్పించి హర్ష మొందుఁ
గమనీయచరితలఁ గల్యాణలీలల
వినుతించి వినుతించి విస్మరించు
దరహాసకాంతులఁ గరుణార్ద్రదృష్టుల
ధ్యానించి ధ్యానించి మేను మఱచు
సర్వలోకేశ్వరునిఁ గొల్చు సమయమందు
రాజరాజోచితోపచారములయందు
మఱఁగి తద్గతచిత్తయై మహిపతనయ
యనితరానందపారవశ్యంబు నందు. ఉరా

క. స్వరచితహారిగీతములకు
సరిగమపధనిస్వరములు జత గూరిచి బం
గరువీణ నెలయుకంఠ
స్వర మమృతము గురియఁ బాడి సమ్మూర్ఛితయై. ౮

ఉ. ఆతఁడు మెచ్చి చూచినటు
లాతఁడు సత్కృపఁ బల్కరించిన
ట్లాతఁడు సుప్రసన్నదర
హాసముఖుం డయి చేర వచ్చిన
ట్లాతఁడు ప్రేమఁ గోమలక
రాంగుళిఁ గైకొని చేరఁదీసిన
ట్లాతరళాయతాక్షి హృద
యంబునఁ గన్గొని మేనుజల్లనన్. ౮౧

క. లేచి దెసలెల్లఁ దరళవి
లోచనములు గాఁగఁ జూచి లోఁగిటఁ దనలోఁ
దోఁచిన విభునిం గానక
వేచని బయ లెల్ల వెదకు విస్మయపడుచున్. ౮౨

ఉ. వెన్నెలతీవలందుఁ గను
విచ్చిన క్రొవ్విరిరేకులందుఁ, గా
ర్కొన్న మొయిళ్ళయందుఁ, దమిఁ
గొన్న నెమిళ్ళహారంగులందుఁ బై
కొన్న మెఱుంగులందుఁ దన
కోరిక లీరిక లెత్త నన్నిటన్
వెన్నునివిశ్వమోహన వి
నిర్మలమూర్తినె కాంచి జల్లనున్. ౯౦

. కమ్ర తేజములలోఁ గన్నంత చాలకే
కాంతుమోహనమూర్తిఁ గాంచఁ గోరు
విశ్వగీతములలో విన్నంత చాలకే
విభు వేణుగానంబు వినఁగఁ గోరు
గురుబోధనములలోఁ గొన్నంత చాలకే
యధిపువాగమృతంబు నానఁ గోరు
ఉచితభావములలో నున్నంత చాలకే
యభవుసాన్నిధ్యంబు నందఁ గోరు
అనుభవంబు మించి యాస ప్రేరేపింప
భక్తి మించి ప్రేమ పల్లవింప
నతఁడు విశ్వనాథుఁ డన్నంత చాలకే
యాత్మనాథుఁ డగుట కతివ గోరు. ౯౧

సీ. ఆమె కూర్చినకైత లన్నింట శ్రీమూర్తి
విమలచారిత్రమే వెలయుచుండు
ఆమె పాడినపాట లన్నింట శ్రీమూర్తి
కరుణామృతరసంబె కురియుచుండు
ఆమె చూచినచూపు లన్నింట శ్రీమూర్తి
విమలస్వరూపమే వెలయుచుండు
ఆమె చేసినచేఁత లన్నింట శ్రీమూర్తి
యుపచారకలనయే యొప్పుచుండు
నామె కోరుకోర్కు లన్నింట శ్రీమూర్తి
దాస్యవృత్తి యొకటె తనరుచుండు
నెట్టిపుణ్యఫలము నెట్టితపస్సిద్ధిఁ
గన్నవారొ యామెఁ గన్నవారు. ౯

గీ. పరమపావన మగునామెభక్తినుండి
నిర్మలప్రేమకళలు గాన్పింపఁ గాంచి
పెండ్లికళ దోఁచుచుండె మాబృందకంచు
బంధుగురుజను లానందభరితు లైరి. ౯

క. తనబంధుజనులవిధమును
జననీజనకులతలంపు సఖులతెఱంగుల్
దనగురులయభిమతంబున్
గని యొకనాఁ డామె తల్లిఁ గని యిట్లనియెన్. ౯

చ. అనురక్తుండు మహానుభావుఁడు కృపా
పాంగుండు త్రైలోక్య శో
భనచారిత్రుఁడు పూరుషోత్తముఁడు స
త్పాత్రుండు కృష్ణుండు పా
వనగోలోకవిభుండు నావిభుఁడుగా
వాంఛించి ప్రేమించితిన్
జననీ నాదగుకోర్కి తెల్పఁగదె వా
త్సల్యంబునన్ దండ్రికిన్. ౯౫

క. అన సంశయవిస్మయములు
తనమనమునఁ బెనఁగొనంగఁ దల్లి ప్రియమునన్
తనయ నుపలాలనంబులఁ
దనుపుచు నక్కునఁ గదించి తా నిట్లనియెన్. ౯౬

క. బాలా యెంతటిబేలవె
యాలోకవిభుండు సులభుఁ డని యెంచితివే
లీలామయుఁ డాతనియి
ల్లాలగుభాగ్యంబు మానవాంగన కగునే. ౯౭

క. రాధారమణీహృదయా
రాధితశుభవిమలచరణరాజీవుఁడు దే
వాధీశులకే నందని
బోధానందాత్ముఁ డతనిపొందు దొరకునే. ౯౮

క. చిన్నతనపుఁ దలఁపులచేఁ
గన్నెతనమువలనఁ గలుగుకాంక్షలచేతన్
దన్నెఱుఁగక తర మెఱుఁగక
యెన్నితిగా కంత భాగ్య మెట్లగు నమ్మా. ౯౯

క. అని యనునయించి యాదర
మున సంభ్రమముం బ్రియంబు ముప్పిరిఁగొనునె
మ్మనమున బోధించెడి తన
జననిం గని పలికె బృంద సవినయఫణితిన్. ౧౦౦

సీ. మణికిరీటంబుపై మన్నింప లేదఁటే
కొఱగాని పురినెమ్మి కోడిఱెక్క
అధరపల్లవముపై నానింప లేదఁటే
వెలిపోని విరసంపు వెదురుపుల్ల
శ్రీవత్సకాంతిపైఁ జెలఁగింప లేదఁటే
వెలలేని చిఱుమోఁక తులసిరేక
కల్యాణమూర్తిపైఁ గదియింప లేదఁటే
చొరరాని పసరాకు పురుగునూలు
అఖిలలోకవిభుని నతిభక్తి సేవింప
నాత్మవిభునికరుణ నభిలషింపఁ
దగనివారుఁ బడయఁదగనివా రెవ రమ్మ?
తరతమంబు లేల తడవెదమ్మ? ౧౦౧

క. ప్రేమానందారాముని
ప్రేమమయుని ప్రేమమూర్తిఁ ప్రేమవివశునిన్
ప్రేమింపఁగలుగువారల
కామితఫలములకుఁ గొఱఁత గలుగునఁటమ్మా. ౧౦౩.

క. అనుచుండునంతలో న
మ్మనుజవిభుఁడు వచ్చి వారిమాటలు విని య
మ్మునివచనమ్ములు భావ
మ్మునఁ దోఁచుటయున్ బ్రమోదపులకితమతియై.

ఆ. అఖిలలోకనాథు నాత్మనాథునిగాఁగఁ
బడసి లోకమాతృపదముఁ గాంచి
మమ్ము సకలభువనమాతామహులఁ జేయఁ
దలఁచి తెంతధన్యతముల మమ్మ. ౧౦౪

సీ. చెదరి పోవకయుండఁ జిత్తంబు హత్తించి
చెలువుని ధ్యానింపవలయు నమ్మ
పట్టు వీడక యుండ భావంబు సంధించి
వరదుని దర్శింపవలయు నమ్మ
సరణి దప్పక యుండ సన్నుతు లొలయించి
వల్లభు నర్థింపవలయు నమ్మ
శ్రద్ధ వాయక యుండ సద్భక్తి వెలయించి
వరమూర్తి మెప్పింపవలయు నమ్మ

ఇతరచింత మఱచి యెల్లకష్టంబుల
మఱచి పితరులైన మమ్ము మఱచి
నిన్ను నీవె మఱచి నిఖిలేశు నాత్మేశు
వశము చేసికొనఁగవలయు నమ్మ. ౧౦౫

ఆ. ఎల్లవారిఁ దనిపి యెల్లరతో నాఁడు
చందమామ చేతి కందనట్లు
అఖిలజగము నిండి యగపడిన ట్లుండి
యాతఁ డాసకొలఁది కందఁ డమ్మ. ౧౦౬

క. రూపమె కానీ మధురా
లాపమె కానీ కళాకలాపమె కానీ
యాపరమేశ్వరుకరుణకుఁ
బ్రాపకములు గావు కావు భక్తివిధమునన్. ౧౦౭

క. అన్నియమము లన్నిష్ఠలు
నన్నిగమాచారవిధులు నన్నిగ్రహముల్
చిన్నారి రాచకన్నియ
వెన్నఁడు నెఱుఁగవుగదమ్మ యెట్లు మెలఁగెదో.

క. అనుటయుఁ దమకంబును సి
గ్గును నభిమానంబు పెంపుఁ గూరిమి మెఱయన్
వినయమధురవచనంబుల
జనకుని కిట్లనియె బృంద సమ్మదలీలన్. ౧౦౯

క. నీపట్టి నగుచు మునికృప
చూపట్టినదాన నగుచు శుభగతి జగముల్
చేపట్టిన శ్రీకృష్ణుని
చేపట్టఁగఁజాలనట్టె చెదరనిభక్తిన్. ౧౧౦

సీ. గగనవాహినులలోఁ గ్రమవీచికలలోఁ
దమ్మిదోనియలలో దాఁగియున్న
దిగ్వితానములలో దివ్యాంబరములలోఁ
జిత్రవర్ణములలోఁ జేరియున్న
చైత్రయామినులలోఁ జారుచంద్రికలలోఁ
బుష్పవాటీరములలోఁ బొంచియున్న
అరుణరాగములలో గిరికందరములలో
ఘనమణిద్యుతులలోఁ గలసియున్న
విశ్వమం దెట్టు లెందున్న వెదకి తెచ్చి
యమలతమభక్త్యుపాయన మాచరించి
ప్రణయమయమూర్తి యైననాభాగ్యమూర్తి
కరము గ్రహియించి వరియింపఁగలను తండ్రి. ౧౧౧

క. గోలోకాధీశ్వరు ది
వ్యాలోకవిభాసమానహారిదంతరుఁ బ్రే
మాలోకసులభుఁగా నవ
లీలన్ గ్రహియింతు నర్మిలిన్ నీకరుణన్. ౧౧౨

బృందావనము.

మ. యమునాతీరముచెంత నున్న మనయు
ద్యానంబు కల్యాణధా
మముగాఁ బూజనకీర్తనాదిశుభక
ర్మమ్ముల్ విధుల్గాఁ బ్రబో
ధమయధ్యానమె జీవనక్రియఁగ సం
ధానించి శ్రీకృష్ణు భ
క్తమనోమోహను సుప్రసన్నహృదయుం
గావించి సేవించెదన్. ౧౧౩

క. చని యాపుష్పారామం
బున నేకాంతముగ భువనమోహనునారా
ధన మాచరించి కొలువఁగ
ననుమతి నాకొసఁగవలయు నాదరమతులై.

క. అని నిశ్చయమును నుచితం
బును బ్రియమును ధర్మబద్ధమును బహుమాన్యం
బును నగుగతి వచియించిన
తనుజాతం గాంచి తల్లిదండ్రులు వేడ్కన్. ౧౧౫

శా. అమ్మా నీసుమనోరథంబు సఫలం
బాఁగాక పూజాకలా
పమ్ముల్ ధ్యానసమర్చనాదులు శుభ
ప్రాప్యంబు లౌఁగాక ని
త్యమ్ముఁ శ్రద్ధయు భక్తియు న్మెఱయ దే
వాధీశ్వరుఁ గృష్ణునిఁ
సమ్మోదంబునఁ గొల్చి యవ్విభుకృపా
సామ్రాజ్యముం గాంచుమా. ౧౦౬

గీ. అనుచు దీవించి తలిదండ్రు లాదరించి
తనయ యేకాంతసేవకు ననుమతించి
చెలులు మాధవీశారదల్ చెంతనుండి
మెలపున మెలఁగఁగా నియమించి రెలమి. ౧౦౭

క. పరమ తమభక్తియుక్తిఁ
హరిపాదంబులకు సర్వ మర్పించిన ధీ
వరు లగుగురులకు వరునిగ
హరిఁ గోరినతనయఁ గనుట హర్షము గాదే! ౧౦౮



౫ అంగసౌందర్యము.

శ్రీనిధిచిహ్నాంబాప్రత
దానఫలప్రాప్తిరూప తనయప్రవరా
మానితగుణవైభవ సాం
ద్రా! నిర్మలకీర్తిచంద్ర! రామనరేంద్రా! ౧౦౯

ఉ. నెమ్మి దలిర్ప నిట్లు జన
నీజనకుల్ దనయీప్సితాప్తికిన్
సమ్మతి సేయ బృంద తన
సంగడికత్తెలతోడఁ గేళిగే
హమ్మున నుండి యంగణము
లందు నికుంజములందుఁ జల్వచ
ప్రమ్ములయందు నాడుచును
బాడుచు వేడుచు నుండె వెన్ననిన్. ౧౧౦

క. నూతనరీతుల నిత్య వి
నూతనభావములు మెఱయ నూతనగతులన్
నూతనకళలన్ వికచా
బ్జాతనయన వెలయుచుండె భక్తినియుక్తిన్. ౧౧౧

క. తలఁచినతలఁపులు చూపుల
వెలువడునాలోనె మాధవీశారద ల
చ్చెలువకు వలసిన వన్నియు
నెలమిన్ సమకూర్చుచుండి రేమఱకుండన్. ౧౧౨

బృందావనము.

సీ. దినదినంబున కొక్కదినుసుపూవులఁ గూర్చి
సంధ్యాత్రియంబును స్వామిఁ గొలుచు
విధివిహితంబుతో వివిధవ్రతంబుల
నియమంబు దప్పక నిర్వహించుఁ
బరమానురక్తి బంగరువీణతోఁ గళ
స్వన మెత్తి నామకీర్తనము చేయు
నేకాంతమున నొక్కయెడ నుండి త్రైలోక్య
నాథునిగూర్చి ధ్యానంబు సలుపు
పువ్వుటీరంబులను నదీపులినములను
వెన్నెలబయళ్ళ నుద్యానవీథులందు
విహ్వలత మీఱ విశ్వేశు వెదకుచుండు
నతితరప్రేమపరవశ యగుచు బృంద. ౧౧౩.

సీ. లలితామృతాంశుకాంతులఁ దోఁచినయైన
దిక్కుదిక్కున కేఁగి తేఱి చూచు
కలవిహంగమరుతంబులఁ బల్కినయైనఁ
జెట్టుచెట్టున కేఁగి చిన్నవోవు
చలితశాఖాకరంబులఁ బిల్చినయైనఁ
గొమ్మకొమ్మకు నేఁగి యుమ్మలించు

బృందావనము.

మలయమారుతవీచికలఁ దాఁకినవైన
మూలమూలకు నేఁగి ముచ్చుముడుఁగుఁ
బ్రమదమున నాడు నుప్పొంగి పాటపాడు
దీనయై వేఁడు నవశయై మేను మఱచుఁ
గన్నె తనలోన వెలుఁగొందు చిన్నికృష్ణు
వెలుపలం గాంచఁ గాంక్షించి విభ్రమించు. ౧౧౪

సీ. చిగురుటాకులఁ జూచి చిన్నెవన్నెలఁ జూచి
పూవుగుత్తులఁ జూచి తావిఁ జూచి
దోరపండులఁ జూచి తీరు తీయముఁ జూచి
చిలుకబోదలఁ జూచి చెలువుఁ జూచి
చుక్కపేరులఁ జూచి సొంపు పెంపులఁ జూచి
చందమామను జూచి సౌరుఁ జూచి
చెలువకాల్వలఁ జూచి కలకలంబులఁ జూచి
కొండకోనలఁ జూచి కొమరుఁ జూచి

యొడలు పులకింప నానందపడుట మేలొ
యెడఁద గంపింపఁ జిడిముడిపడుట మేలొ
తెలిసి తెలియనితనమునఁ దిరిగి తిరిగి
విభునిసన్మూర్తిఁ గనలేక వెట్టియగుచు. ౧౧౫

ఉ. చిన్ని మెఱుంగుఁదీవియలఁ
జెల్వము శైలములన్ మహత్త్వమున్
వెన్నెలలం బ్రసాదమును
వేణికలన్ మధురామృతత్వమున్
మన్నుల సుస్థిరత్వము వి
మానపథంబులఁ బ్రాభవత్వమున్
గన్నులఁ గట్టియున్ దెరలు
గట్టెద వేమిటి కీశ్వరేశ్వరా ! ౧౨౬

క. అని యీగతిఁ బలవించుచుఁ
గనుఁగోనల నశ్రుజలము గ్రమ్ముకొనంగా
వనవీథిన్ ఘనవీథిన్
వినువీథిన్ దిరిగి తిరిగి విభుని వెదకుచున్. ౧౨౭

క. అనుదిన మిటు తపియించెడి
మనుజవిభుతనూజఁ గాంచి మాధవి తననె
మ్మనమున జాలిం బడి మం
తనమున నొకనాఁడు శారదం గని యనియెన్. ౧౨౮

మ. కనలేదో వినలేదొ యీజగమునం
గల్యాణచారిత్రముల్
మనలోనే యిటువంటికూరుములు సం
ప్రాప్తించెనే కాని దే
వునిఁ బెండ్లాడినవారివింతకథ లే
వో చూచి యీరాజనం
దినిపోల్కిన్ దపియించువెఱ్ఱిపడు చెం
దే నుండునే శారదా! ౧౨౯

చ. సిరులు విలోకనంబులను
జెందొవచందము లందఁబోవు; క్రొ
మ్మెఱుఁగులు చెక్కుటద్దముల
మించునిగన్నిగ లీవు; ముద్దులున్
మురిపములున్, వినోదములు
మున్నటియట్టుల లేవు భావసా
గర మిఁటు లీఁదుబృంద యెటు
గా నిఁక నేమగునో తలంచితే! ౧౩౦

క. కసిగాటుగ మెసవుటలున్
నసి చెడి స్రుక్కుటలుఁ, బరవశతఁ జొక్కుటలున్
అసురుసు రగుటలె కానీ
మసలుచు నున్నదియె బృంద మనలోకమునన్? ౧౩౧

క. తమయూహాలపై విశ్వా
సముఁ గాంచుటె కాని యెంతచతురుల కైనన్
దమకొలఁది కంను నఁటవే
యమృతముఁచవి నింగివిభవ మభవునిపొడవున్. ౧౩౨

ఉ. బాసలు చేసి వచ్చినది
పట్టు సడల్పదు ఘోరచింతలన్
గాసిలుచున్న దిట్లు జరు
గన్ జెలి యెప్పుడో వీఁగి మేనిపై
నాసలు రోసి యొండు తెఱఁ
గైనఁ బదంపడి నేను నీవునుం
జేసెడి దేమి వత్తయగు
చేనికి నేతము లెత్తవచ్చునే. ౧౩౩

క. తెలిసినదాన వుపాయము
తెలియని నాలాగె యున్నఁ దికమకపడుచుం
దెలిసియుఁ దెలియనివగలం
గలఁగి నలఁగుచెలువ కేడుగడ లెవ రింకన్. ౧౩౪

మ. చెలులై, చుట్టములై, పదానుగతులై
చేదోడు వాదోడు లై
మెలఁగ న్నేర్తురు పేరఁటంచు మది నె
మ్మి న్నమ్మి యీ బాలికన్
దలిదండ్రుల్ మన కొప్పగించిరి గదా
తద్ధర్మ మూహించి నె
చ్చెలి బాగోగులు చూచుకోవలదఁటే
చింతింపఁగా లేదఁటే ! ౧౩౫

సీ. లలితంపుఁగళల సొంపులు నింపు వెన్నెలఁ
జిలికించు నిండుజాబిలిని జూపి
చెలువంపుటలరుల పొలపంపు వన్నెలఁ
బులకించు వలపుఁదీవలను జూపి
సరసంపుఁబలుకులఁ బరువంపువిరిదేనె
లొలికించు శుకపికంబులను జూపి
మురిపంపుచూపుల నెఱిమించు ముద్దులఁ
దులకించు చిత్రవస్తువులఁ జూపి
అందనిపదంబునకుఁ గుందుబృందమనసు
ప్రకృతికి మరల్చి వికృతిఁ దెరల్పకున్న
నన్నిటిఁ ద్యజించుకొన్న యిక్కన్నె వెఱ్ఱి
తిన్నఁబడునన్న యాస యేమున్న దమ్మ ! ౧౩౬

గీ. తలకొని హితాహితంబులు దెలియఁ జెప్పి
చెలినిరాలంబగతి మార్పవలయుఁ గాని
మనవి చేసిన నేమనుకొనునో యనుచు
మన మిఁక నుపేక్ష సేయుట మంచి గాదు. ౧౩౭

క. అని మాధవి కరుణాశ్రులు
నునుఁజెక్కుల జాలువాఱ నొచ్చినమది మో
మునఁ దోఁప వేగిరించుటఁ
గని శారద మొలకనవ్వు కన్నుల మెఱయన్. ౧౩౮

ఉ. ఎంతటిబేల వైతివె చె
లీ! జగదీశుఁడు భక్తవత్సలుం
డంతదయావిహీనుఁ డఁటె
యాతనిసొమ్మయి యున్ననిశ్చల
స్వాంతులకున్ గొఱంత యిసు
మంతయుఁ గల్గునె యట్టిలోటు గో
రంతయె కొండయై ప్రభుస
మాఖ్యకు మాయనిమచ్చ గాదఁటే. ౧౩౯

క. ఎంతజతన మెంతటివిడు
పెంతతపము సలుపకున్న నీశ్వరుని మనః
కాంతునిఁ జేసికొనందగు
నంతటిసౌభాగ్యవిభవ మనుభవ మగునే. ౧౪౦

సీ. బ్రమొక్కి వేఁడుకొోలంది మూతి బ్రిప్పినసేమి
బల్మిఁ గైకొొన నడ్డపడఁగ లేఁడు
వెఱచి పీఁగుకొోలంది విక్రమించిన సేమి
తేటి చూచిన నిరోధింప లేఁడు
విన్నవించుకొోలంది మిన్న కుండిన సేమి
పట్టు పట్టిన మాట నెట్ట లేఁడు
కొోలుచుచున్న కొోలందిఁ గొండయెక్కిన సేమి
ధాటి సూపిన గీటు దాఁటలేఁడు
భక్తి నచలశక్తిఁ బడయుదాఁక నె యమ్మ
హాత్ముఁ డట్టు లిట్టు లగును గాని
తన్ను జగము మనసుఁ గన్ను నేకము చేసి
తలఁచినంత నెదుట నిలువఁబడఁడె? ౧౮౧

చ. కొొలిచినవారికిన్ మనసు
గొొల్చినరీతిఁ బ్రసన్నుఁడై తపః
ఫలము లనుగ్రహింపక న
భఃపదమట్టు లభావమట్టు ల
వ్వలిపొడఁ గాననీయక య
వస్తువొ వస్తువొ యేదొ యేమియుం
దెలియనివాఁడె యైన మఱి
దేవునితోఁ బని యేమి జీవికిన్. ౧౮౨

ఆ. సర్వజీవహితుఁడు సర్వేశ్వరుఁడు ప్రేమ
మూర్తి గాని వట్టి మొరడు గాఁడు
అతని కెల్లగతుల నాత్మార్పణము చేసి
కొన్న రాజసుతయు గోల గాదు. ౧౪౩

ఆ. సఖుల మైనమనము శమదమంబులలీలఁ
జెలువ తెలివిఁ దేర్పవలయుఁ గాని
యప్రబోధసంశయమ్ములకై వడిఁ
జుట్టుముట్టి కలఁత పెట్టఁ దగునె? ౧౪౪

క. తరియించి యిరుగుపొరుగులఁ
దరతరములవారి నెల్ల ధన్యులఁ జేయం
దొరకొని పరమార్థమునకు
నరసెను చెలిఁగూర్చి యింత యడ లేమిటికే. ౧౪౫

క. అని యూఱడించి మాధవి
మనసు కుదురుపఱచి బుద్ధిమతి శారద య
ల్లన రాకుమారియేకాం
తనివాసలతాగృహాంగణము చెంగటికిన్. ౧౪౬

క. అరిగి నిలువెల్లఁ బూచిన
గిరిమల్లిక కెలన మోడ్పుగే లెత్తి సమ
స్థిరదృష్టిఁ గనుచు దీన
స్వరమునఁ బ్రార్థించునాత్మసఖిఁ గన్గొనియెన్. ౧౪౭

బృందావనము.

గీ. కాంచి నెచ్చెలిసద్భావగతి కొకింత
యంతరాయంబుగా నెదురౌట తనకుఁ
దగ దని తలంచి యొకగున్నపొగడవెనుక
నొదిగి కనుచుండె దరిఁజేరునదను వేచి. ౧౪౮

క. బృంద తనయెదుటఁ బుష్ప
స్యందనగతుఁడై ప్రభుండు సాక్షాత్కారం
బందినటు లెంచి బ్రహ్మా
నందంబునఁ బొంగి నెమ్మనంబు చెలంగన్. ౧౪౯

సీ. ఈపాట యాపాటయే పాడితిని గాని
నీచేతిమురళిఁ గానేర నైతి
ఈబాస యాబాసయే పల్కితిని గాని
నీగూఁటిచిలుకఁ గానేర నైతి
ఈవాడ యావాడయే చేరితిని గాని
నీయింటిదాసిఁ గానేర నైతి
ఈవేస మావేసమే వేసితిని గాని
నీమెచ్చుమూర్తిఁ గానేర నైతి
చీఁకటింటిలోనె చేబారలను వైచి
నిన్నుఁ జేరఁదగినతెన్నుఁ గనక
తల్లడిల్లు చుంటి దయచేసి యిఁకనైన
నాదరింపరాదె యాదిదేవ! ౧౫౦

క. అని కోరుకొనుచు నంగన
యనురాగరసంబు పొంగి యతివేలంబై
తోనఁకాడఁగ మునుకాడుచు
వెనుకాడనిభక్తి నెంతో వేడుకపడుచున్. ౧౫౧.

సీ. పాటించి నీవింత పలికితేఁ జాలదే
పలుకని బంగారుభాగ్య మేల
నమ్మించి నీవింత నవ్వితేఁ జాలదే
నవ్వని రతనాలనాణె మేల
మురియించి నీవింత ముట్టితేఁ జాలదే
ముట్టని ముత్యాలమూట లేల
శోధించి నీవింత చూచితేఁ జాలదే
చూడని నీలాలమేడ లేల
పలుకుదీవ లేనిభర్మవల్లకి యేల
రసమయంబు గానిరాగ మేల
స్వామిఁ దనుప లేనిసంకీర్తనము లేల
జీవనంబు లేల దేవదేవ! ౧౫౨.

ఆ. అనుచు నభిమతంబుఁ జనవును మెలపుచు
జలము మీఱఁ బలికిఁ దెలుపుకొనుచుఁ
గాంత యంత జాలిగదురు చిత్తంబునఁ
దత్తరంబు దోఁపఁ దమకపడుచు. ౧౫౩.

సీ. అఖిలజీవనపాత్ర మైననీసత్కృపా
వారి నాకన్నీరు చేరనిమ్ము
అంతర్బహిర్వ్యాప్త మైననీప్రణయవా
యువున నానిట్టూర్పు నోలయనిమ్ము
అమృతమోహనకోశ మైననీసంగీత
కళ నావచోలీల గలయనిమ్ము
ఆనందపరిపూర్ణ మైననీసౌభాగ్య
నగరి నాతనువల్లి సొగయనిమ్ము
నిన్ను దర్శించి నీసుసన్నిధిని జేరి
నిన్ననుకరించి నీమూర్తినే స్మరించి
యాడి పాడఁగనిమ్ము నా కన్య మేల
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి. ౧౫౮

క. అని తనయాత్మైక్యంబును
దనయాశయుఁ దనగుణంబుఁ దనలోపంబున్
దనమనమునఁ దలపోయుచు
వనజానన దిగులు చెంది వారనియార్తిన్. ౧౫౯

సీ. ఐశ్వర్యమును గోరు ననుకొంటివో యేమొ
యాసల నడఁగింపు మంతె చాలు
అర్ధాసనము వేఁడు ననుకొంటివో యేమొ
యడుగులకడ నిల్పు మంతె చాలు

అపవర్గ మాసించు ననుకొంటివో యేమొ
యజ్ఞాన మెడలింపు మంతేచాలు
అమృతత్వ మర్థించు ననుకొంటివో యేమొ
యభవత్వ మిప్పింపు మంతె చాలు
తిరుగులేనిదాత దొరకెఁగదా యంచుఁ
దలకుఁ దగని దడుగఁగల నఁటయ్యా
ఎదుటఁ బడును చాలు నీకోరికల కేమి
ప్రణయగుణసనాథ ! ప్రాణనాథ ! ౧౫౬

చ. అని ముదమారఁ దెల్పుచుఁ బ్రి
యుఁ బెసలారఁగ గారవించుచున్
మన మలరార మెచ్చుచు మ
మత్వమునన్ దనివారఁ బిల్చుచున్
జన వెలరార వేఁడుచు మ
నమ్మున నిశ్చలభక్తియుక్తి న
వ్వనజదళాయతాక్షి నిజ
వల్లభుఁ గన్నక్రియన్ భజించుచున్. ౧౫౭

ఆ. ఆసపడుచుఁ జేర నరుగుచు నంతలో
నిట్టె కంటఁ దోఁచుహృదయనాథుఁ
డట్టె మాయమైనయట్లైన నడలుచు
వెఱ్ఱిపడుచు బృంద వివశ యగుచు. ౧౫౮

బృందావనము.

క. మనమున భయసంభ్రమముల
మునుకొని సంతాపఖేదములు పెనఁగొనఁగా
వనిత హృదయేశ్వరునిఁ జే
ర్కొని దీనత్వమున వేఁడుకొనఁగఁదొడంగెన్. ౧౫౯

సీ. వినవచ్చు నీపల్కు లని యూరితిని దేవ
శ్రుతుల నింప విదేమి చోద్య మయ్య
కనవచ్చు నీరూప మని పొంగితిని దేవ
కనులఁ దేర్ప విదేమి కర్మ మయ్య
చనవచ్చు నీత్రోవ నని నమ్మితిని దేవ
పదము నిల్ప విదేమి పంత మయ్య
మనవచ్చు నీచెంత నని యుబ్బితిని దేవ
తలఁపుగొల్ప విదేమి ధర్మ మయ్య

అల్పమతి నేను, పరమాణు వైననేను
ఘనతరుని నిన్నుఁ ద్రిభువనగర్భు నిన్నుఁ
దగుదు నని కొల్వఁ దలఁచుటే తప్పుటయ్య
భక్తలోకైకనాథ నాప్రాణనాథ. ౧౬౦

మ. అనిచింతాభయసంశయాకుల నిరా
శాకంపితస్వాంతయై
యనుతాపాతిభరంబునం దనువు డ
య్యన్, నిష్క్రియాపన్నతన్
గనుదోయిం గరుణాశ్రువారికణముల్
గ్రమ్మంగ, బింబాధరం
బున నిట్టూర్పుసెగల్ బుగుల్కొనఁగ నం
భోజాస్య దీనాస్యయై. ౧౬౧

క. వల పాఁగక విలపించుచు
నిలుపోపక తూలుచున్న నెచ్చెలి బృందం
దిలకించి వచ్చి శారద
మెలపునఁ గౌఁగిట గదించి మేను నిమురుచున్. ౧౬౨

ఆ. వెన్నుసఱచి, వేఁడి కన్నీరు దుడిచి, నె
మ్మోము వట్టి, చెక్కు ముద్దువెట్టి,
యలకలొత్తి నుదుటితిలకంబు సవరించి
తెలివి యలవరించి పలుకరించి. ౧౬౩

ఉ. కన్నియ! మున్నొకప్పుడును
గన్నది విన్నది గాను స్వాంతమం
దెన్నఁడు లేని బేలతన
మీయెడ నీయెడఁ గల్గె, భక్తిసం
పన్నుల తల్లిదండ్రుల ప్ర
భావ మెఱుంగవో మానిమాట లో
నెన్నవో భక్తవత్సలు గ్ర
హింపవో భక్తులజాడఁ జూడవో. ౧౬౪

ఆ. నియమనిష్ఠ లెఱిఁగి నిగమసూక్తు లెఱింగి
నిజ మెఱింగి నిన్ను నీ వెఱింగి
భక్తసులభుఁ డైనపతి నెఱింగినదాన
వింతచింత నొగుల నేటికమ్మ! ౧౬౫

క. అని హెచ్చరించి మెలపునఁ
జనవున ధైర్యంబుఁ గఱపు శారదఁ గని నె
మ్మనమున వగ నొగులుచు న
ల్లన బృంద యెలుంగు దొట్రిలఁగ నిట్లనియెన్.

సీ. తలఁపునం దొక్కింత తళుకు మన్నంతనే ౧౬౬
కనులలోఁ జీఁకటుల్ గ్రమ్ము నమ్మ
చిత్తమం దొక్కింత చిటుకు మన్నంతనే
చెవులలోఁ గుంచికల్ చేరు నమ్మ

ఉల్లమం దొక్కింత జల్లు మన్నంతనే
యొడలిలో మైకంబు లడరు నమ్మ
నెమ్మది నొక్కింత గమ్ము మన్నంతనే
యూర్పులో నట్టాడక లాదవు నమ్మ
నేనె దరిఁ జేరఁజాల కున్నానొ యేమొ
నాథుఁడే దూర మేఁగు చున్నాఁడొ యేమొ
వరునకు నాకు నేమియంతరము గలదొ
ఎన్ని చెప్పినఁ బాలుపోకున్న దమ్మ. ౧౬౭

ఆ. అన్నిటను వెలింగి యన్నింటి వెలయించి
వన్నె గన్నయాత్మవల్లభుండు
ఎన్నిగతులఁ గొలిచి యెన్నాళ్ళు పిలిచిన
బదము నిలుపఁ డమ్మ ! పలుకఁ డమ్మ. ౧౬౮

సీ. ఏచుక్కతళ్కులో నాచెల్వ మున్నదో
చెంగల్వ నడుగవే చెప్పు నేమొ
ఏపువ్వుదేనెలో నాప్రేమ యున్నదో
మొలదేఁటి నడుగవే తెలుపు నేమొ
ఏపక్షి పల్కులో నాపాట యున్నదో
వినుచూలి నడుగవే వినుచు నేమొ
ఏమింటితెరఁగలో నామూర్తి యున్నదో
సురవేణి నడుగవే చూపు నేమొ

ఎఱిఁగి యెఱుకసేయుగుఱుతులు సూపి నా
వెతలు దీర్చి ప్రాణవిభునిఁగూర్చి
ప్రేమ నాదరించుపెద్ద లిందెవరున్న
నచటఁ జేరి వారి నడుగు మమ్మ! ౧౬౯

ఆ. వట్టిభ్రమలె కాక వా రైన వీ రైనఁ
దెలిసినంత తెలుపఁగలరు కాని
ప్రభుఁడు వచ్చి యెదుటఁ బడినట్లు లుండు నే
చెలువ! నీవె నిజము చెప్పు మమ్మ! ౧౭౦

సీ. ఏవిందు గావింప నిష్టమో తన కంచు
మృదుపదార్థము లెల్లఁ బదనుపఱచి
ఏరసం బొలయింప నిష్టమో తన కంచు
విరిదేనియల నెల్ల వెదకి తెచ్చి
ఏశయ్యఁ గూర్పింప నిష్టమో తన కంచు
నలరుజాతిసుమంబు లలవరించి
ఏపాట పాడంగ నిష్టమో తన కంచుఁ
గలనిస్వనము లెల్లఁ గలయఁ గూర్చి
ప్రతిదినంబుఁ బరమభక్తిభావంబున
నెదురుచూచు టయ్యె నింతె కాని
వేడుకలకు నొక్కనాఁడైనఁ దనసేవ
సేయనీయఁ డేమిచెప్పు నమ్మ! ౧౭౧

సీ. ఉపవాసమే కాని యెప్పుడైనఁ బుడిసెఁడు
జలమైనఁ ద్రావినజాడ లేదు
ఆయాసమే కాని రేయైనఁ బట్టెఁడో
గిరమైనఁ గైకొన్నగుఱుతు లేదు
సంచారమే కాని క్షణమైన రవ్వంత
యడుగైన నిలిపినయచ్చు లేదు
జాగారమే కాని వేగైనఁ గాసంత
కన్నైన మూసిన చిన్నె లేదు
ప్రాణవల్లభుండు బడలి యెచ్చోట నె
ట్టున్నవాఁడో తెలియకున్న దమ్మ
ఎచటి కేఁగి పిలిచి యెట్లు ప్రార్థించినఁ
జిత్తగించి యిల్లు చేరు నమ్మ! ౧౭౨

ఆ. అనుచు దిగులుపడుచు నడిగినమాటయే
యడిగి యడిగి జాలి నడలుచుండఁ
జతురవచనరచన శారద సఖి మేలు
కొలిపి తాల్మి నూలుకొలుపు చుండె. ౧౭౩



౬. అభినవకోరకము.

ఉపోద్ఘాతము

శ్రీవిద్యానందా సం
భావితగురుసాధుసుకవిపండితబృందా
శ్రీవిలసత్రాసికావ్య
ప్రావీణ్యా రామభూమిపాలవరేణ్యా ! ౧౭౪

ఉ. చిన్నిమెఱుంగుపూసరులు
చెక్కిన కెందలిరాకుచీరలన్
వన్నెల దిద్ది తీర్చి చలు
వల్ పచరించి హారంగు నించు ను
న్నొన్నెలవెల్లి నింగికిని
నేలకు నిండఁగఁ గ్రుమ్మరించుచున్
గ్రొన్ననబొండ్లకున్ సొగసు
గూరుచునొక్కవసంతయామినిన్. ౧౭౫

ఉ. పున్నమచందమామ తలఁ
పుల్ వలపుల్ మది నింపఁ జల్వరా
తిన్నియ నెచ్చెలుల్ విరులఁ
దీరిచి కూర్చినట్టిసెజ్జ రా
కన్నియ మేను చేర్చి తన
కాంతు ననంతునిదివ్యలీలలన్
సన్నుతి సేయుచున్ బొరయు
సంస్మృతివిస్మృతుల న్మునుంగుచున్. ౧౭౬

క. తద్గతచిత్తంబున నుడి
గాద్గద్యము దోఁపఁ బ్రణయగాథల రోమాం
చద్గతిఁ బాడుచు విభుని జ
గద్గురుఁ గన్నట్లు, కలయఁ గన్నట్లైనన్. ౧౭౭

ఉ. చిత్తము చెంగలింపఁ దమిఁ
జెందినకోరుకు లగ్గలింపఁ బెన్
దత్తర మావరింప బెడి
దంబుగ నూర్పులు సందడింపఁ గ్రొ
మ్మొత్తనిమేనుదీఁగ విరి
మించువలెన్ బులకింపఁగా బయల్
హత్తి కవుంగిలించి చెలి
యూఁపఁగ దాఁపఁగరానిప్రేముడిన్. ౧౭౮

క. పలికించి హాసచంద్రిక
లొలికించినయట్లు, చూపు లోలయించి మదిన్
గులికించినట్లు, ప్రాణము
పులకింపఁగ రాగరసవిమోహితమతియై. ౧౭౯

సీ. మొగమోటములు గూర్చి మగిడిపోవకు సుమీ
పలుకెల్ల నమృతంబు చిలుకుచుండె
కనుఁబ్రామికలు గూర్చి కదలి పోవకుసుమీ
నిలువెల్లఁ బులకలు నిండుచుండె

పారవశ్యముఁ గూర్చి పాటిపోవకు సుమీ
తలఁపెల్ల నానంద మొలుకుచుండె
ఆత్మవిస్మృతిఁ గూర్చి యట్టె పోవకు సుమీ
భవమెల్లఁ గోర్కులు పండుచుండె
మఱపుగోలుపకు మింక, నేమఱకు మింక,
తలఁపు ద్రిప్పకు మింకఁ, బోఁదలఁప కింక
నాదుకోను మింక, మన మేక మైతి మింక
సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి. ౧౪౦

క. అని ప్రార్థించుచుఁ బరవశ
తను దానోనరించినట్టి తపఁబాటులకుఁ
మనవులు దెలుపుచుఁ దనవి
న్ననువుల వివరించుకొనుచు నతివ కలంతఁ. ౧౪౧

సీ. మలపుకోలేనైతి మలసి నీకై నేత
సడలింపఁజేయు నావడఁకుఁదనము
ఆఁచుకోలేనైతి నడరి నీనునుమేను
నొగిలింపఁజేయు నాగగురుపాటు
అడఁచుకోలేనైతి నలమి నీనెమ్మోముఁ
గందింపఁజేయు నాకాఁకయూర్పు
నిలుపుకోలేనైతి నిండి నీచేర్పుకౌఁ
గరఁగింపఁజేయు నాకంటినీరు

తప్పు గలిగె ననుచు దద్దరిల్లుటె కాని
యేమి చేయవలెనొ యెఱుఁగ నైతి
సర్వకారణుఁడవు క్షమియింప కుందువే
ప్రణయగుణసనాథ ప్రాణనాథ. ౧౮౨

గీ. అని సుఖావేశపరవశ యగుచు బృంద
భవము సార్థకమ్మై తపఃఫలము చేతి
కందినట్లు భావించుచు డెందమందు
నంతకంతకు నానంద మతిశయింప. ౧౮౩

సీ. అభవ నీకర్ఘ్యపాద్యములు గాఁజాలెనే
నిస్సారమైనయీనీటిబుగ్గ
కాంతనీయారాత్రికంబు గాఁజాలెనే
యణిముణియైన యీమెఱుఁగుఁబురుగు
విశ్వతోముఖ నీకు విందు గాఁజాలెనే
పేలవంబైన యీపేలగింజ
నాథ నీసంసేవనంబు గాఁజాలెనే
చిందువందైన యీచిన్నిపూవు
పరమదుర్లభమైన నీకరుణ లేక
తావకశ్రీపదాంభోజసేవనమున
నలరు టబ్బునె యీపరమాణువునకు
సత్కృపాధామ దేవతాసార్వభౌమ. ౧౮౪

బృందావనము.

మ. అని యుప్పొంగుచు నాథు పేరురము గా
ఢాశ్లేషముం జెంది కం
దినదో, చక్కనిమేను సందిళుల సం
ధిఁ బల్మిమైఁ జిక్కి సా
క్కినదో యేమొ యటంచు జాలిగొనుచుఁ
గీల్కొన్న కేల్దోయి నో
య్యనఁ దప్పించుచు నంతలోనె పతి మా
యం బైన విభ్రాంతయై. ౧౮౫

ఉ. దిగ్గన లేచి నల్గడలఁ
దేఱి కనుంగొని జీవితేశ్వరుం
దగ్గఱఁ గాన లేక కలఁ
తం బగుచిత్తము దత్తరింపఁగా
నగ్గలమై దురంతవిర
హానలతాపము ముమ్మరింపఁగా
బెగ్గిలి ఱిచ్చపాటున వి
భీతమృగేక్షణ చూచుచుండఁగన్. ౧౮౬

సీ. అంగనాలోకమోహన విగ్రహము వాఁడు
కందర్పశతకోటి కళలవాఁడు
ఘనసారసురభిచందనవిలేపమువాఁడు
రమణీయపీతాంబరంబువాఁడు

శరదిందురమ్యప్రసన్నాననమువాఁడు
తరుణాబ్జపత్రనేత్రములవాఁడు
మధుమాసచంద్రికామధురహాసమువాఁడు
కరుణామయావలోకములవాఁడు
కులుకునడవాఁడు ముద్దులుచిలుకువాఁడు
నగలరతనాలనెఱనిగనిగలవాఁడు
విరిసరులవాఁడు జందెంపుసిరులవాఁడు
వనితకడ కొక్క శుభమూర్తి వచ్చి నిలిచె. ౧౮౭

సీ. నిలిచినయంత, లోనులికి, నివ్వెఱఁ గాంచి
వెనుకంజ వైచి, నెమ్మనము పదిల
పఱచి, రూపము లేఱుపఱచి, పోలిచి చూచి
కొని, యవ్వగాముల గుఱుతు పట్టి,
ప్రాణేశ్వరుండు గాఁడని నిశ్చయించి, యే
కాంతమం దున్న నాచెంత కీతఁ
డేకతంబున వచ్చెనో కదే యని మనం
బున వితర్కించి, తపోబలంబు
కలిమి నొంటిపాటునకు జంకక, నయంబు
వెలయ, నభ్యాగతస్స్వయంవిష్ణువన్న
పలుకుఁ దలపోసి, యాతనిఁ బలుకరించి
చెలువ సమయోచితముగఁ బూజించుటయును.౧౮౮

క. ఆతిథ్యంబును గైకొని
భూతలనాథాత్మజాతఁ బొగడుచు మది సం
ప్రీతి మెఱయ దీవించుచు
నాతఁడు మృదువచనరచన నమృతము గురియన్. ౧౮౯

ఉ. ఎవ్వరిదాన వీవు పుర
మెయ్యది నీయభిధాన మేమి యి
ట్టివ్వని నొంటి నుంచి చెలు
లెచ్చటి కేఁగిరి రేయి వెన్నెలన్
బువ్వులసెజ్జఁ జేరి తల
పోసెద వేసుకృతాత్ముఁగూర్చి యో
జవ్వని శ్రోత్రపర్వముగ
సర్వము నాకెఱిఁగింపు మింపునన్. ౧౯౦

క. జపముల నుపవాసములన్
దపముల నియమములఁ బడలినదియే నీమ
వ్వపుమే న్వడఁబడుసుమలత
కుపమ యగుట కేమి హేతువో కల్యాణీ. ౧౯౧

గీ. ఎంతసర్వార్థసిద్ధుల కేని నాస
రగులుకొలిపించుదుర్లభురాల వయ్యు
నేయభావంబుకొఱకు నీ విటు తపించి
చిగురుమెమ్మేను నొగులఁ జేసెదు లతాంగి. ౧౯౨

క. నావుడు సముచితగతి మృదు
భావంబును సమధికప్రభావముఁ బలుకుం
బూవులతావుల మెఱయఁగ
నావెలఁదుక యిట్టు లనియె నాతనితోడన్. ౧౫౩.

సీ. ఏడుదీవుల నెల్ల నేలమిఁ బాలించు కే
దారభూదారుఁడు తండ్రి నాకు
అతనియర్ధాంగి మహాదేవునర్ధాంగిఁ
దలపించు శుభవల్లి తల్లి నాకు
శృంగారమును భక్తి నంగీకరించి వి
శ్వం బెల్లఁ గాంచుటే చదువు నాకు
సకలభూజనసుఖాశ్రయమైన త్రైలోక్య
గురుపాదపీఠమే గుఱుతు నాకు

జపము, లుపవాసములును, బూజావ్రతములుఁ
బసితనమునుండి యలవాటుపనులు నాకు
రాధికాకాంతునకు జగద్రక్షకునకు
రమణిఁ గావలె నని మనోరథము నాకు. ౧౫౪

బృందావనము.

ఉ. నామము బృంద యందు రిట
నాచెలు లుండరు నిత్యమున్ బరం
ధామునిఁ గొల్చు చివ్వనము
న న్విహరింతు ననారతంబు; నా
కామితమున్ ఘటించుశుభ
కల్పుఁడవే న్వర మిమ్ము; కానిచో
నేమిఫలంబుఁ గూర్చు నిపు
డీవొనరించు వృథాప్రసంగముల్. ౧౯౫

చ. అన విని మొల్కనవ్వ దోలు
కాడుమొగంబునఁ గమ్మగాలి వీ
చినక్రియఁ, బువ్వదేనియలు
చిందినలా, గపరంజివీణ మీ
టినవగఁ గుల్కునెన్నుడి న
టింపఁగ నన్నటనానురూపమో
హానమయదివ్యమూర్తి పరి
హాసము నబ్రముఁ దోఁప నిట్లనెన్. ౧౯౬

శా. ఏమేమీ కమలామనోహరుఁడు శ్రీ
కృష్ణుండు నీకంటికిన్
సామాన్యుండయి తోఁచెనే యుగసహ
స్రంబుల్ తపోనిష్ఠ నెం
తో మాహాత్మ్యముఁ గన్నమౌనులును గ
న్గోలేనివిశ్వేశ్వరు
న్నీముంగేలిశుకంబుఁ జేసికొని మ
న్నింపం దలం పయ్యెనే. ౧౯౭

శా. ఆలావణ్యవికాస, మాశుభకటా
క్షాలోకసౌభాగ్య, మా
లీలాహాసవిలాస, మాసరస కే
ళీనిర్మలానంద మా
గోలోకంబున గోపగోనివహముల్
గొల్వంగఁ గొల్వుండు రా
ధాలోలాక్షికిఁ దక్క నన్యసతికిన్
దర్శింపఁగా శక్యమే. ౧౯౮

మ. లలనా యెంతటివెఱ్ఱిదానవు నిరా
లంబుండు, నిత్యుండు, ని
ర్మలతేజోనిధి, నిర్వికల్పుఁడు, నిరా
రంభుండు, నిస్సంగి, ని
శ్చలుఁ, డాఢ్యుం డగుదుర్లభుండు చెలివై
సంబంధివై లోఁగిటన్
నెలవైయుండునె వారివీఁగికరణి
న్నీబోఁటినాబోంట్లకున్. ౧౯౯

చ. అతివ సహస్రశీర్షకుఁ డ
నంతుఁడు గూడ సహర్ణిశంబులున్
శతశతకల్పముల్ భజన
సల్పుచుఁ దత్ప్రియనామమంత్ర సం
తతజపనిష్ఠుఁ డయ్యు శర
ణం బగుతచ్చరణాంబుజద్వయి
న్మతిఁ గనలేక యుండె నఁట
నాఁటికి నేఁటి కొకప్పుడేనియున్. ౨౦౦

సీ. ఇరువదియైనుమవే లీయుగంబులు చన్న
నొక్కదేవేంద్రు నాయుస్సు చెల్లు
ఇరువదియెన్మిది యింద్రులకాలంబు
శ్రీజగద్విధాతకు దినసమంబు
అట్టిదినంబు లైదాఱులు గడచిన
నాసరోజాసనుమాస మగును
ఆనెలల్ పదియురెండైన వర్షంబగు
బ్రహ్మాయు వట్టివత్సరశతంబు
ఇట్టిబ్రహ్మకల్ప మేపరంధాముని
నిమిషమాత్రముగ గణింపఁబడునొ
ఆమహాత్మునెయ్య మది యేడ, మానవ
మానవతి యదేడ మమత యేడ. ౨౦౧

సీ. ధరణియై సర్వభూతముల మోచెడివాఁడు
వాయువై ప్రాణముల్ వోయువాఁడు
తపనుఁడై విశ్వ మంతయు వెలిఁగించువాఁ
డనలుఁడై తేజంబు నినుచువాఁడు
చంద్రుఁడై యోషధీసమితిఁ దన్పెడువాఁడు
జడధియై జీవనం బిడెడువాఁడు
నింగియై భువనముల్ నిలువఁ దావిడువాఁడు
విష్ణుఁడై యన్నింట వెలయువాఁడు

ముజ్జగంబులు నెలకొన్న బొజ్జవాఁడు
మూఁడుమూర్తులకును మొట్టమొదటివాఁడు
తలఁపులకు నందరానిపదంబువాఁడు
చెలువ నీకన్నుసన్నల మెలఁగువాఁడె. ౨౦౨

చ. సకలజగద్విధాత శ్రుతి
సమ్మతకర్మఫలప్రదాత య
ర్భకుఁ డయి పుట్టి గిట్టి
పలుబాముల మోములునాలుగింట నే
యకలుషమూర్తిపాదనఖ
రాగ్రమునే న్గనఁ జాలఁ డట్టినా
యకమణి కేల్ గ్రహింప నగు
నా తగునా నినుబోఁటి బోటికిన్. ౨౦౩

సీ. నెలరేక వెన్నెలల్ నించుచిత్రవినోది
కతివ నీమృదుమందహాస మెంత
చుక్కకొక్కొక్కవన్నెఁ జెక్కించుప్రోడకు
నాతి నీచక్కందనం బదెంత
నల్లమబ్బునఁ దటిద్వల్లు లల్లెడుమేటి
కింతి నీనెమ్మోనికాంతి యెంత
కలవిహంగులగీతముల దిద్దుజాణకుఁ
గలికి నీపలుకుబంగార మెంత

ఖరకరునిచెంత మిణుఁగురుఁబురు వదెంత
అమరగంధర్వయక్షవిద్యాధరాధి
నాథుఁడై దేవదేవాధినాథుఁ డైన
పురుషమణిచెంతఁ బూసంతబోఁటి యెంత. ౨౦౪

క. సుమలత ఘనతరుసంస
ర్గమె కోరుం గాని యెంతరసమయుఁడైనన్
దమకించునె ఘనమణికై
తమతలకుం దగనికోర్కె తరమే పడయన్. ౨౦౫

చ. తెలివి యతిక్రమించిరొ, మ
తిభ్రమఁ గాంచిరొ, భూతభవ్యముల్
తెలియఁగఁ జాలకో వినుక
లి స్మృతిమాలి రమామనోవిభున్
సులభునిగాఁ దలంచి వయ
సుం జెలువమ్మును వమ్ము గాఁగ ని
ట్టులజడిఁ జెందుచుంటి వక
టా నిను నేమనవచ్చుఁ గోమలీ! ౨౦౬

చ. పిలువనిపేరఁటంబునకుఁ
బెత్తసముం గొని వచ్చి, కోరకే
కెలన వసించి, పల్కి, పలి
కించి వినం జవిగానివార్తలన్
దెలుపుట పాడి గా దని మ
దిం దలపోసియుఁ జెప్పుచుంటి నీ
చెలువముఁ జూచి నీయసుఖ
జీవనముం గని జాలిఁజెందుటన్. ౧౦౭

చ. మదికి హితంబు, సత్యమును,
మంగళమున్, సరసం, బమోఘమున్
మృదుమధురంబు, నచ్చమయి
మించినచక్కనియొక్కమాట చె
ప్పెద విను; మిట్టు లూరక త
పించి త్రిలోకమనోజ్ఞరూపసం
పదఁ దులకించు క్రొందలిరుఁ
బ్రాయము వాయము సేయ నేటికిన్. ౨౦౮

సీ. మగువ! సర్వసుపర్వమకుటమాణిక్యమా
లిక లెల్లఁ బాదదీపికలు నాకు
తరుణి! సర్వమనోజ్ఞగిరికాననప్రదే
శము లెల్లఁ గేళిరంగములు నాకు

సఖి! సర్వసౌభాగ్యసౌఖ్యసామ్రాజ్యభో
గము లెల్ల నఖదర్పణములు నాకు
బాల! సర్వానంగకేళీకళారహ
స్యము లెల్ల వశ్యమంత్రములు నాకు
పడఁతి! గుణరూపవిభవప్రభావనిత్య
ధర్మగతు లెల్లఁ బ్రకృతిసిద్ధములు నాకు
నెల్లవిధములఁ జూడంగ నీడు జోడు
నే నగుదు నీకుఁ దగుదువు నీవు నాకు. ౨౦౯

చ. అవనితలాధినాయకుల
యందు సమానులు లేక, యక్షుదా
నవగరుడోరగామర గ
ణంబులలో నెదు రింత లేక, వై
భవమున కీడు లేక ప్రతి
భర్త వహించు నను న్వరించి, గా
రవమున మించి, శోభనప
రంపరఁ గాంచి, సుఖింప నెంచుమా. ౨౧౦

బృందావనము.

సీ. అమరనందనముపై నభిలషించెద వేని
యామోదలీలావిహారసుఖము
హేమభూధరముపై నిచ్ఛగించెద వేని
వరమణీమయధామవాససుఖము
అమృతసాగరముపై ననుమతించెద వేని
యాకల్పశీకరాసేకసుఖము
శ్రీచందనాద్రిపైఁ జిత్తగించెద వేని
మందగంధానిలానందసుఖము
కుముదహితలోకసుఖముపైఁ గోర్కి గలదొ
కమలభవలోకసుఖముపైఁ గాంక్ష గలదొ
ప్రమథపతిలోకసుఖముపై భ్రాంతి గలదొ
ఏసుఖము గోరెదో తెల్పవే లతాంగి. ౨౧౧

క. తరుణీ! పరిణయకాంక్షన్
హరిఁ గోరి తపించుకంటె నాలోకమనో
హరు, సులభుం, దరుణుని, నను
వరియించి సుఖింపరాదె వాల్లభ్యమునన్. ౨౧౨

క. అని ప్రియమారఁగఁ బలుకుచుఁ
జనవు మెఱయ సరస కరిగి సాహసగతి న
వ్వనజానన కరకమలముఁ
దన కేలం గీలుకొలుపఁ దమకించుటయున్. ౨౧౩

ఆ. అతివ రోసగిల్లి యారక్తలోచన
యగుచుఁ గ్రోధకంపితాధరమున
నాఁగు మాఁగు మనుచు నాతని నదలించి
నిలిపి యాజ్ఞలోనె నిలువరించి. ౨౧౪

క. వేదానుమతంబులు ధ
ర్మాదర్శంబులు హితంబు లనఘంబులు స
త్యోదారంబులు విబుధజ
నాదరణీయంబు లైనయట్టి పలుకులన్. ౨౧౫

సీ. ఓమహాభాగ! నీకీముష్కరత యేల?
మనసు కుదురుచేసికొనుము; నీవు
విప్రకుమారుని విధమున నగపడు
చున్నవాఁడవు; శాంతియుతము లైన
నిగమాధ్యయనసత్యనిష్ఠాతపోవ్రతా
చరణంబులు ధరణీసురవరులకుఁ
బరమధర్మము లని పలుకుదురు గదా! ప
రస్త్రీలఁ గోరి విరాలి గొనుట
యెంత తప్పు! నీవంటివాఁ డిట్లు సేయఁ
దగునె? బ్రహ్మవిదులు తమధర్మబలము
కలిమి జగముల నిలుపుట గలదు; నీ వ
ధర్మపరుఁడవై క్రుంగిపోఁ దలఁచె దేల? ౨౧౬

క. వెలుఁగుఁ గని దీపశిఖఁ బడు
శలభమువలె, నామిషంబుచవిఁ గాలమునన్
మెలివడుమీనమువలెఁ బర
లలనలఁ గామించి చెడఁ దలంచుట లగ్గే. ౨౧౭

క. మతి చెడి యతిదుష్కృతులై
పతివ్రతలఁ గలఁగఁజేయు పాపాత్ములు సం
తత ఘోరనరకముల నా
తతబాధలఁ గాంత్రు చంద్రతారార్కముగన్. ౨౧౮

గీ. క్షణికసుఖదంబు చిరదుఃఖకారణంబు
సర్వనాశంబు పరవధూసంగమంబు
అట్టిపాపంబునకు నొడిగట్టి దూఱుఁ
బడి చెడఁగఁ బ్రాజ్ఞుఁ డెవ్వాఁడు పాలుపడును. ౨౧౯

గీ. ఆగమము లెంచి యాచార మనుసరించి
వర్తనముఁ గాంచి కులగౌరవముఁ దలంచి
భ్రాంతు లెడలించి నావిన్నపము గ్రహించి
పాపమతి డించి పదవయ్య బాపనయ్య. ౨౨౦

ఉ. ఒంటిగ నివ్వనిన్ విడిసి
యుంటి నటంచును గూర్మి నెచ్చెలుల్
వెంటను లేరటం చబల
లేమ యటంచుఁ దలంచి బల్మిమై
నంటఁగ నూహ చేసి యడి
యాసల నొందకు బ్రాహ్మణుండ నీ
కొంటెతనంబు సాగ నను ౨౨౧
గొంటివె? లే రనుకొంటె రక్షకుల్?

ఆ. దిగధినాథు లిందె తిరుగుచు నున్నారు
వెలసి యున్నవారు విబుధు లిందె
అఖిలలోకనాథు నానతిచే నిందె
దాఁగి యున్నవాఁడు ధర్మమూర్తి. ౨౨౨

సీ. ఆత్మస్వరూపుఁడై యరయుచుండెను జుమీ
యఖిలేశ్వరుండు నారాయణుండు
జ్ఞానస్వరూపుఁడై సాఁకుచుండెను జుమీ
సచ్చిదానందుండు శంకరుండు
సుమనస్స్వరూపుఁడై చూచుచుండెను జుమీ
చతురాగమజ్ఞుండు జలజభవుఁడు
బుద్ధిస్వరూపమై ప్రోచుచుండెను జుమీ
యఖిలలోకారాధ్య యాదిమర్గ

ప్రాణిపంచేంద్రియస్వరూపములతోడఁ
గాఁచుచున్నారు సుమి దేవగణము లెల్లఁ
గాపుగడ లేనిచోటు లోకమునఁ గలదె
భ్రాంతిపడుచుంటి వో వెఱ్ఱిబ్రాహ్మణుండ! ౨౨౩

గీ. అంచఱెక్కల వెన్నెల లద్దువాఁడు
చిలుకఱెక్కలఁ బచ్చలఁ జెక్కువాఁడు
నెమ్మిఱెక్కలఁ జిత్రముల్ నించువాఁడు
నన్ను నేవేళఁ గాఁచుచున్నాఁడుసుమ్మ! ౨౨౪

క. బాలుర వృద్ధుల నబలల
నాలంబము లేక తిరుగునసదల నెలమిన్
బాలించుకృపాళుఁడు గో
పాలుఁడు నాపాల నుండఁ బైఁబడఁగలవే? ౨౨౫

క. అవివేకంబునఁ బోవకు
మవనిసురు లవధ్యు లగుట నాత్మఁ దలఁచి నీ
యవినయములు సైరించితిఁ
బ్రవిమలమతిఁ గాంచి పోయి బ్రదుకుము విప్రా!

క. అని నొవ్వనాఁడి నయమును
వినయమ్మును మెఱయఁ దెలుపు వెలఁదుకపలుకుల్
విని విననియట్టు లాతఁడు
ఘనమోహాన్మత్తుఁ డైనకైవడిఁ గడఁకన్. ౨౨౬

క. వెడవెడ నవ్వుచు, బుడిబుడి
నడ తడఁబడ నవ్విలాసనటుఁడు దుడుకునన్
దొడిబడునుడువుల నుడువుచు
వడివడిఁ జని పడఁతికరము వడయఁ గడఁగుటన్. ౨౪

సీ. అమ్మానినీమణి యచలశిఖరివలె
నించుకంతయుఁ జలియింపక, హృద
యంబున నడరుకోపానలంబును గోప
నంబు చేసికొని, వినయసునిశిత
వచనంబులందు దివ్యస్వభావంబు దీ
పింపఁ, బ్రశాంతగంభీరవీక్ష
ణముల రక్షణశిక్షణప్రభావంబు లు
ద్యోతంబు లగుచుండ, మాతృమూర్తి
యైనయాదిలక్ష్మివలె, వరాభయకర
కమలయుగళంబు సారించి, కనుబొమముడి
మాత్రనే వాని వారించి, మందలించి
జీవహితధర్మపథము సూచించి, పలికె. ౨౫

ఉ. ఓకలుషాత్మ మీఁదెఱుఁగ
వో మతిఁ దప్పి పరిభ్రమించెదో
కాక యధర్మవృత్తమె సు
ఖం బని చూచి చెడంగ నెంచితో

శ్రీకరు లోకనాథుని వ
  రించినసాధ్విని సాహసంబునన్
దాఁకెదు; పావకోగ్రశిఖఁ
  దాఁకి నశింపఁ దలంపు గల్గెనే. ౨౩౦

క. ఎన్నిగతుల బోధించిన
నన్నా! నీకన్నతల్లి నని యెఱుఁగవుగా!
పున్నెముఁ బాపముఁ గానని
కన్నులుగలనీవు చిన్నకందువుగావే. ౨౩౧

క. అని యింకను నేమేమో
యనఁబోవుచునుండ "ధర్ముఁడాతఁడు సాధ్వీ!"
యని సూర్యదేవుఁ డాలో
వినువీథిం బలుకునంత విస్మయలీలన్. ౨౩౨

గీ. పవన మెడలింప నడఁగినబంతివోలెఁ
గొక్కె మెడలింప ముడిఁగినగొడుగువోలె
మాటమాత్రాననే యక్కుమారమూర్తి
క్రుంగి దిగజాఱె చిన్నారికోమరుఁ డయ్యె. ౨౩౩

ఆ. మన సెఱుంగఁగోరి మతిఁదప్పఁ జేయకే
ధర్ముఁ డింత చిన్నతనముఁ గాంచెఁ
బుణ్యసతుల జెఱుపఁబూనునధర్ముదు
ర్మతుల కింకఁ బుట్టగతులు గలవె? ౨౩౪



౨. ఆమోదప్రసూనము.

శ్రీశత్వ వైభవాది
ప్రాశస్త్యైశ్వర్యధుర్య బంధురచర్యా
శ్రీశారదావిహారని
వేశా కల్యాణరామవిపులాధీశా! ౨౩౫.

ఉ. చూచినచూపులోనె పురు
షుం డటులై రవిమండలంబునం
దోఁచినదివ్యవాక్కుల శ్రు
తుల్ చెదరన్ లలితాంగి బృంద సం
కోచము విభ్రమంబు వెఱఁ
గుందనముల్ దనవీక్షణప్రభా
వీచికలం బయల్పడ ది
విన్ భువిఁ గాంచుచు నున్నయంతలోన్. ౨౩౬.

ఆ. తొలిపలుకులతోడ నలుమొగంబులవేల్పు
గణముతోడ మూఁడుగనులవేల్పు
విబుధకోటితోడ వేయుగన్నులవేల్పుఁ
గలసి వచ్చి యెదుట నిలుచుటయును. ౨౩౭

బృందావనము.

క. వారిహతాద్గమనంబును
వారిసముద్వేగభరము వారి తెలుంగుల్
వారివిలోకనభంగియు
వారిజముఖి కాంచి బొమ్మవాటి వెఱఁగునన్. ౨౩౮

క. కిమ్మనఁగా నేరక కేల్
దమ్ములు జోడించి నిటలతటి నిలిపి విలో
కమ్ముల భయభక్తులు విన
యమ్ము నయము వెలయ వెలఁది యట్టె నిలుచుటన్.

క. పరమహితంబుగ జగముల
భరియించెడిధర్మమూర్తి పసిబాలుండై
పొరలాడుట సుర లాయెడఁ
గరుణామతిఁ జూచి చూచి కలఁగుచు నుండన్. ౨౪౦

సీ. పరమేష్ఠి యబ్బాలు నరసి నెమ్మనమునఁ
గరుణారసము పొంగి వఱదవాఱ
జీవకోటుల నెల్లఁ జిత్రించు మొత్తని
తనకేలుదోయి నాతని గదించి
యాగమపావనం బైనపేరురమున
యజ్ఞసూత్రముచెంత హత్తుకొలిపి
తనలోకజనకత్వమును జూపుచూపులఁ
బరఁగించి యాచిన్నిపాపఁ గనుచు

అమరవరు లెల్లఁ దనవెంట నంటి రాఁగ
నల్ల నల్లన నరిగి యయ్యతివ దరిసి
బాలుఁ డగుధర్ముఁ జూపుచు జాలిఁగొలిపి
హితమహితభాషణంబుల నిట్టు లనియె. ౨౮౧

గీ. ఓసతీమణి! వసుధయు నుడుగణంబు
నయ్యనంతుండుఁ జంద్రసూర్యగ్రహములు
విశ్వ మంతయు నితనిచే వెలయుచుండుఁ
గాన నీధర్మమూర్తిని గావు మమ్మ! ౨౮౨

ఆ. అనుచు విన్నవించునబ్జాసనునిభాష
ణముల ననుకరించి యమరవరులు
లోకధర్మరక్షణాకులచిత్తులై
పడఁతి వేఁడుకొనఁగఁ దొడఁగి రంత. ౨౮3

క. జగములు సుస్థిరములుగా
జగతిన్ జీవులకు సౌఖ్యసంపద లొలయన్
జగము వెలిఁగించునీతని
మగువా! మన్నింపు మని యుమాపతి గోరెన్. ౨౮౪

క. తల్లీ! నీయభిమతములఁ
జెల్లింతుము గాని కరుణచే నీధర్మున్
దొల్లిటివలె నిలిపి నిలుపు
మెల్లజగంబుల నటంచు నినుఁ డర్థించెన్. ౨౮౫

ఆ. జనని ! నీవు ధర్మసంస్థాపనమునకై
తపము చేసి మహిమఁ దనరినావు
ధర్మశిక్ష సేయఁ దగ దమ్మ నీ కని
యాదరమున శేషుఁ డానతిచ్చె. ౨౪౬

ఆ. నలినభవునియాజ్ఞఁ దలఁ దాల్చి నిన్నుఁ బ
రీక్ష చేయ వచ్చె నింతె కాని
యితఁడు నిరపరాధి యితనిఁ బ్రోవు మటంచు
నర్థి వేఁడుకొనియె నమృతకరుఁడు. ౨౪౭

ఆ. తపముకలిమివలన ధర్మంబుఁ గని, తపః
ఫలము ధర్మబలమువలనఁ గాంచి
జీవు లలరుచుంద్రు గావున నీధర్ముఁ
బ్రోవు మమ్మ యనియె దేవవిభుఁడు. ౨౪౮

క. ధర్మబలంబుననే స
త్కర్మంబుల కెల్ల ఫలము గలుగును గానన్
ధర్మవతీ ! కరుణామతి
ధర్ముని వెలయింపు మని యుదధిపతి వేఁడెన్. ౨౪౯

ఆ. ధర్మయుక్తి జగతి ధన్యంబుగాఁ జేయ
ధర్మబుద్ధిఁ గాంచి తపము చేసి
ధర్మసిద్ధిఁ గోరుతల్లి ! యీధర్ముని
దేర్పు మనుచు వాయుదేవుఁ డనియె. ౨౫౦

ఆ. ధర్మమూలముననె కర్మఫలంబుల
కొలఁదు లెఱిఁగి జీవకోటి కెల్ల
నొసగుచుండు నాకు నూఁతగా ధర్మంబు
నిమ్మటంచు దక్షిణేశుఁ డడిగె. ౨౫౧

క. మాతా! భారతభూమి స
నాతనధర్మార్జనంబునకుఁ బుట్టిన వి
ఖ్యాతచరిత్రవు ధర్మ
జ్యోతిం గాపాడు మనుచు శుచి వచియించెన్. ౨౫౨

ఉ. ఈగతి వేఱువేఱ వచి
యించి యధర్మభయంబునన్ మహా
భాగులు దేవముఖ్యులు శు
భప్రతిపాదకులై స్వధర్మర
క్షాగతిఁ గోరి వేఁడుటయు
క్ష్మాపతినందన బృంద యద్భుతో
ద్వేగభయప్రకంపితమ
తిన్ దివిజావళిఁ గాంచి మ్రొక్కుచున్. ౨౫౩

క. కనుదమ్ములఁ గరుణాశ్రులు
దొనఁకాడఁగ నెలుఁగుఁబలుకుఁ దొట్రిల, నయ్యో
యని నలువచేతిబిడ్డం
దనచే నందుకొని నెమ్మనము తల్లడిలన్. ౨౫౪

బృందావనము.

చ. అనఘచరిత్రులార ! దివి
జాధిపులార ! యితండు ధర్మరా
జని మును పేనెఱుంగ; నన
యంబున నాకడ సంచరించుటన్
మనసు మరల్పఁ బూని నయ
మార్గమునన్ మెలఁగింప నెంచి ప
ల్కినపలు కింతచేసెఁ; దిల
కింపరె నాయెడ దోస మున్నదే ! ౨౫౫

క. పరతత్త్వవేదులకు నన్
బరీక్ష చేయంగ నింత పనిఁగొనవలెనే ?
ఎఱుఁగక జరిగినపనికై
యెఱిఁగి వగవవలసె నిప్పు డిందఱ మిచటన్. ౨౫౬

క. నాకును మీకును నైష్ఠిక
లోకంబునకున్ సమస్తలోకంబులకున్
శ్రీకరుఁ డగునీధర్మని
వైకల్యంబును సహింప వశమే యకటా ! ౨౫౭

గీ. లోకవిభులార ! మీశుభాలోకనమున
విశ్వలోకేశ్వరునికృపావీక్షణమున
మహితసత్త్వంబుఁ గని లోకమంగళముగఁ
బూని యీధర్మ వర్ధిష్ణుఁగా నొనర్తు. ౨౫౮

క. అని పలుకుచు బాలుని గ్రొ
న్నన గద్దియ నిలిపి, నెమ్మనమున జగన్నా
థుని నిలిపి, తపశ్శక్తిఁ
గనుదమ్ముల నిలిపి పూని కడలుకొనంగన్. ౨౬౯

గీ. నేను గావించుతపమును నేనొనర్చు
శ్రీమహావిష్ణుపూజలు సేవనములు
నిత్యసత్యంబులేని యీనిమిషమందె
ధర్మమూర్తి వర్ధిష్ణుఁడై తనరుఁ గాత! ౨౭౦

గీ. నాతపోనియమంబులు నావ్రతములు
విమలములు సత్యములు నయి వెలయునేని
పావనం బగునాపుణ్యబలమువలన
ధర్మమూర్తి వర్ధిష్ణుఁడై తనరుఁ గాత! ౨౭౧

గీ. ఆదివిష్ణుండు నిత్యసత్యాత్ముఁ డగుట
ఆమహేశుండు శివుఁడు జ్ఞానాత్ముఁ డగుట
సత్యమే యగునేని యీక్షణమునందె
ధర్మమూర్తి వర్ధిష్ణుఁడై తనరుగాత! ౨౭౨

గీ. ప్రకృతి బ్రహ్మయు సర్వసుపర్వగణము
యజ్ఞముఁ దపంబు సత్యంబు లయ్యెనేని
భువనకల్యాణమూర్తి యీపుణ్యమూర్తి
ధర్మమూర్తి వర్ధిష్ణుఁడై తనరుఁగాత! ౨౭౩

బృందావనము.

ఆ. అనుచు లోకమంగళాలోకనములతో
దివ్యభక్తియోగదీక్షతోడ
శ్రుతిహితంబు లైనశుభవచనంబులఁ
బరమసాధ్వి బృంద పలుకునంత. ౨౬౪

క. సత్యవతీ ! నీపలుకులు
సత్యంబులు, నీతపంబు సత్యము, నీస
త్కృత్యంబులు సత్యంబులు
సత్యము సత్య మనుపలుకు చదలం దోఁపన్. ౨౬౫

క. సురబృందంబులకంటం
బార దీసినయట్లు ధర్మపురుషుఁడు పొదలెన్
బరమాద్భుతముగ మింటన్
దెరఁ దీసినయట్లు కృష్ణదేవుఁడు తోఁచెన్. ౨౬౬

క. సురలోకపారిజాతము
లరవిరినెఱదేనెసోన లత్తఱిఁ గురియన్
సురనయనసారసంబులు
సరసానందాశ్రుమధురసంబులు గురిసెన్. ౨౬౭

సీ. ఆనందతరళభవ్యాలోకనమునుండి
కరుణామృతరసంబు గడలుకొనఁగ
మహితసుందరమందమధురహాసమునుండి
యామోదచంద్రిక లలముకొనఁగ

కమనీయదివ్యమంగళవిగ్రహమునుండి
సమ్మోహనప్రభల్ గ్రమ్ముకొనఁగ
అతిలోకవిమలకల్యాణతేజమునుండి
ప్రజ్ఞానవిద్యుతుల్ ప్రబలుకొనఁగ
వరదుఁడు పరాత్పరుఁడు భక్తవత్సలుండు
విశ్వనాథుండు దేవదేవేశ్వరుండు
లోకరక్షకుఁ డైనగోలోకవిభుఁడు
సాధ్వి యగుబృంద కపుడు సాక్షాత్కరించె. ౨౬౮

శా. ఓకల్యాణి! భవచ్చరిత్రము పవి
త్రోదారమై, ధర్మ ర
క్షైకాధారమునై, సుపర్వహృదయా
హ్లాదామృతాసారమై,
యాకల్పంబును లోకమంగళమయో
దాహారమై, నిత్యసు
శ్లోకంబై విలసిల్లుఁగాత భువన
స్తుత్యంబు సత్యంబునై. ౨౬౯

బృందావనము.

క. దేవీ! నీజపతపములు
నీవిజ్ఞానైకభక్తినియమవ్రతముల్
పావనములుఁ ద్రిభువనసం
భావనములు నయ్యెఁ బుణ్యపరిపక్వములై. ౨౭౦

ఆ. సాధ్వి! నీతపంబు సార్థకం బగుఁగాత!
విమలధర్మదీక్ష వెలయుఁగాత!
సాధుభక్తి నిత్యసాఫల్య మగుఁగాత!
యభిమతార్థసిద్ధు లమరుఁగాత! ౨౭౧

క. ఏణాక్షి నిట్లు తనుపుచు
వైణవగానానుమోది వరదుఁడు హరి క
ల్యాణకరంబున లీలన్
బాణిగ్రహణంబు చేసె భవముఖు లలరన్. ౨౭౨

క. హరి యీగతిఁ, గరుణింపఁగఁ
బరమానందమున బృంద పరవశయై శ్రీ
చరణంబుల భవసాగర
తరణంబుల వ్రాలి భక్తితాత్పర్యమునన్. ౨౭౩

మంజరి.

ఓసర్వలోకేశ! యోసత్ప్రకాశ!
హృదయేశ! నినుఁ గోరి యున్నాళ్ళకైన
ఈశైలవాహిని యింకి పోకుండ
నమృతార్ణవము చేరె నంతియే చాలు;

ఈమల్లెవిరిదండ యెండి పోకుండ
నమృతమూర్తి వహించె నంతియే చాలు;
ఈయల్పతమరేణు వెగసి పోకుండ
నమృతతేజముఁ గాంచె నంతియే చాలు;

కాలజీమూతనిర్గతవారికణము
కమనీయనవమౌక్తికం బైనయట్లు
అవనిగర్భాచుతప్తాంగారకణము
సదమలామూల్యవజ్రం బైనయట్లు

పంకనిర్మగ్నదుర్బలకీటకంబు
కల్యాణవిజయశంఖం బైనయట్లు
నాపుణ్యమునఁ జేసి నాజీవితేశ!
నీదర్శనముఁ జేసి నే ధన్య నైతి. ౨౭౪

బృందావనము.

సీ. శ్రుతిసమ్మతంబుగా నుతియింతు నందునా
యక్షరోక్తుల కైన నందరావు
ఆర్యసమ్మతముగా నర్చింతు నందునా
బ్రహ్మవాదులకు నైనఁ బట్టువడవు
సిద్ధసమ్మతముగా సేవింతు నందునా
దివ్యదృష్టులకైనఁ దెలియరావు
జ్ఞానసమ్మతముగా ధ్యానింతు నందునా
ప్రజ్ఞానిధులకైనఁ బాలుపడవు
పరమపురుషు నిన్ను భక్తిఁ బ్రేమించుట
కంటె వేఱ యేమి గలదు నాకు
కూర్మి వెలయ నేలుకొంటివి చాలదే
ప్రణయగుణసనాథ ప్రాణనాథ ! ౨౭౫

సీ. ప్రేమించి సాక్షాత్కరించితి చాలదే
దేవేశ ! యేమి శోధింతు నింక
తిలకించి యాశీర్వదించితి చాలదే
హృదయేశ ! యేమి ప్రార్థింతు నింక

దీవించి మదిఁ బ్రసాదించితి చాలదే
జీవేశ ! యేమి భాషింతు నింక
తేలించి కేలి నందించితి చాలదే
చిత్తేశ ! యేమి వాంఛింతు నింక
నిన్నుఁ బడయుకంటె నీమెచ్చుఁ గొనుకంటె,
నీపదంబుఁ గొలిచి నిలుచుకంటె,
నెలమిఁ గాంచుకంటె నేమి కావలె నింకఁ
బ్రణయగుణసనాథ ప్రాణనాథ ! ౨౭౬

క. బృందాదేవి యమందా
నందంబున నిట్టు లాత్మనాథుని జగదా
నందకరు నందకధరు
నందితుఁ గావించి నుతు లొనర్చుచు నుండెన్. ౨౭౭

క. మనమున సంకోచము, వ
ర్తనమున వినయంబు, దృక్పథంబున భయభ
క్తినయంబులు దోఁపఁగ నొ
య్యన ధర్మవిభుండు చని కృతాంజలి యగుచున్.

గీ. అమ్మ నీయెడ విధినియోగమ్మువలన
నాయొనర్చినయపచారనటనమునకు
నాగ్రహింపక దయఁ జూడు మాదరించి
తనతనయుతప్పు మన్నించు తల్లికరణి. ౨౭౯

ఉ. నన్ను సురేశ్వరాదుల న
నంతవిరించిమహేశ్వరాదులన్
గిన్నరసిద్ధసాధ్యనర
కింపురుషాదుల నెల్లజీవులన్
గన్నమహానుభావు నధి
కంబగుభక్తినియుక్తి నాథుగాఁ
గన్నసతీమతల్లివి జ
గమ్ములతల్లివి తల్లివే గదా ! ౨౮౦

క. కన్నమ్మవు నను దయతోఁ
గన్నమ్మవు పలుకులోనె కందుగ నన్నన్
గన్నమ్మవు పెంపున నుతిఁ
గన్నమ్మవు గావె దేవగణములచేతన్. ౨౮౧

క. అనునంతలోనె వనజా
సనుఁ డో ధర్మస్వరూప ! సత్యము నీవ
ల్కినపల్కు; నీకు వీరలు
జననీజనకు లనుమాట సార్థకమె సుమీ! ౨౨

ఆ. ధర్మకర్త యైన త్రైలోక్యపతి కీమె
ధర్మపత్ని యగుచు ధర్మయుక్తి
ధర్మసాధనమున ధర్మరక్షణమున
ధర్మమాత యగుచు ధన్య యయ్యె. ౨౩

క. ఈవిధి శుభవచనము వా
గ్దేవీవల్లభుఁడు వలుక దిక్పతులు మహా
దేవుఁడు దేవగణంబులు
భావంబున హర్ష మంది పరిపరిగతులన్. ౨౪

ఆ. పరమసాధ్వి బృంద భక్తిప్రపత్తిని
వరదు భక్తలోకవత్సలతను
దలఁచి తలఁచి యొడలు పులకింప జయజయ
ధ్వనుల నుతులు సలిపి తనిసి రపుడు. ౨౫

బృందావనము.

సీ. ఆశాపతులచిత్త మలరారె, నప్పుడే
దివ్యానుభూతి సిద్ధించినట్లు
సురనాథుభావంబు సుఖయించె, నప్పుడే
స్వర్గాధిపత్యంబు వచ్చినట్లు
కైలాసపతిమోము కళఁగాంచె, నప్పుడే
యైశ్వర్యసంసిద్ధి యైనయట్లు
జలజాసనునియాత్మ తెలివొందె, నప్పుడే
యమర బ్రహ్మానంద మబ్బినట్లు

భక్తరక్షణమును ధర్మపాలనమును
విశ్వలోకేశ్వరునికృప వెలయుకతన
నపుడె కల్యాణసుముహూర్త మైనయట్లు
త్రిభువనంబులు సుప్రహర్షితము లయ్యె. ౩౮



౭. ఆనందఫలము.

క. శ్రీదేవీసన్నిభశుభ
వేదవతీసత్కళత్ర విమలచరిత్రా
ఆదర్శవిబుధసుకవిని
వేదితనయతత్త్వ సాధువినుతవశిత్వా. ౩౭౬

ఉ. వారిజగర్భముఖ్యసుర
వర్గమువిన్నప మాదరించి, కే
దారనృపాలుకోర్కి ఫలి
తంబొనరింపఁగ నిచ్చగించి, బృం
దారమణీశిరోమణి హి
తంబొనఁగూర్పఁగ నెంచి, భక్తమం
దారుఁడు సమ్మతించె విహి
తంబుగఁ బెద్దలు పెండ్లి సేయఁగన్. ౩౭౭

క. కమలాసనుండు పెండ్లికి
సుముహూర్తము నిశ్చయింప క్షోణిపతి ప్రమో
దమునం బరిణయశుభకా
ర్యములం దీర్పింపఁ దొడఁగె నతిశీఘ్రముగన్. ౩౭౮

బృందావనము.

క. శ్రీరమణీయశుభాలం
కారంబై రథతురంగగజభటజనసం
చారోదారంబై కే
దారపురం బలరె సమ్మదప్రోజ్జ్వలమై. ౨౯౦

క. పురము మొద లుపవనాంతము
వఱకున్ బందిళ్లు వైచి వసనగృహంబుల్
వరుసగ వెలయించి యలం
కరణము గావించి రవనికాంతుఁడు మెచ్చన్. ౨౯౧

ఉ. ఆంతరికప్రమోదమధు
రాస్యవిలాసముతో, సమస్తసా
మంతులతోఁ, బురోహితుల
మంత్రుల బంధులతో, స్వకీయశు
ద్ధాంతజనంబుతోఁ, బరిజ
నావళితో, విభవంబుతో మహీ
కాంతుఁడు యామునప్రమద
కాననగేహముఁ జేరెఁ బేర్మితోన్. ౨౯౨

క. కేదారునియానతిఁ బ్రా
సాదంబులు మండపములు సదనాంతరముల్
వేదికలు నిలిపి రవ్వని
వీదులు దీర్పించి పెండ్లివిడుదులు గాఁగన్. ౨౯౩

శా. ఆకేదారమహామహీరమణుఁ డ
త్యానందమేపారఁగా
లోకాధీశ్వరుఁ గృష్ణుఁ బెండ్లికొడు క
ల్లుం డంచు బృందావన
శ్రీకల్యాణనికేతనంబునకు వేం
చేయంగ నర్థించి భ
ద్రాకారు న్విడియించె నంత విబుధా
హ్లాదానుమోదంబుగన్. ౨౯౪

సీ. పాకవైరికి మణిప్రాకారసౌధంబు
కీలికి రత్ననికేతనంబు
సమవర్తికిఁ బ్రవాళసౌభాగ్యసదనంబు
నిరృతికి హేమసుందరగృహంబు
అంబునాథునకు ముక్తానంతధామంబు
ననిలున కింద్రనీలాలయంబు
రాజరాజునకుఁ జంద్రప్రభాభవనంబు
నిందుమౌళికి రౌప్యమందిరంబు
తక్కఁగల దేవమానవదానవాది
ముఖ్యులకు వారివారియామోద మెఱిఁగి
యుచితవసతులఁ గల్పించి యుచితగతుల
సత్కృతులఁ జేసెఁ గేదారజనవిభుండు. ౨౯౫

బృందావనము.

ఆ. సరసిజాసనునకు శారదానిలయంబు
అఖిలమునుల కాగమాశ్రమములు
వేలువేల నొసగి విడుదులు గావించి
ముదము నొందె భద్రమూర్తి యగుచు. ౫౯.

సీ. శ్రీకరానంతసుశ్రీకమై శ్రేకమై
వైకుంఠ మిచటికే వచ్చె నేమొ
వరసర్వమంగళావాసమై యాసమై
కైలాస మిచటనే వ్రాలె నేమొ
ధర్మకర్మక్రియాదక్షమై దీక్షమై
విధిపురం బిచటనే విడిసె నేమొ
ఆమోదకల్పకారామమై ప్రేమమై
సురపురం బిచటికే జరిగె నేమొ

కాకయున్న నియ్యమునసైకతములు
నీసుమోద్యానతరులతావాసములును
భువనకల్యాణవైభవస్ఫూర్తిఁ గాంచి
సిద్ధసంకల్పసౌభాగ్యసీమ లగునె ? ౬౦.

సీ. వేయిరూపము లున్నవో యేమొ యాతఁడే
కానంగఁబడు నెల్లకడలఁ దానె
వేయినేత్రము లున్నవో యేమొ యాతఁడే
తిలకించు నెల్లబంధులను దానె

వేయిహస్తము లున్నవో యేమొ యాతఁడే
సవరించు నెల్లకర్జములుఁ దానె
వేయిన క్త్రిము లున్నవో యేమొ యాతఁడే
మెలఁగించు నెల్లకార్మికులఁ దానె
విశ్వవిభుఁ డల్లుఁ డగు నన్న వేడ్కచేత
విశ్వమయుఁ డయ్యెఁ గేదారవిభుఁ డటంచు
వినుతి సేయంగఁ దొడఁగిరి విస్మయమున
బృంద పెండ్లికి వచ్చిన పెద్ద లెల్ల. ౨౯౮

సీ. నవరత్నఖచితకాంచనకిరీటంబుపై
శిఖిపింఛదీధితుల్ చెంగలింప
మణికుండలప్రభామయలలాటంబుపైఁ
దిలకసుందరరుచుల్ తొలకరింప
కౌస్తుభశ్రీయుకలితవక్షంబుపై
వనమాలికాకాంతు లినుమడింప
జలదసన్నిభశుభశ్యామలాంగంబుపైఁ
గనకాంబరద్యుతుల్ కందళింప
భువనమోహనకల్యాణమూర్తి యగుచు
సామమంగళవాద్యఘోషములతోడ
వెడలెఁ బురమేఁగ సుముహూర్తవేళ గాఁగ
విహగవాహనారూఢుఁడై విశ్వవిభుఁడు. ౨౯౯

క. భేరీకాహాళశుభవా
ద్యారవముల దివ్యదీపికాలోకములన్
సారశ్రుతిఘోషల సుర
నారీనృత్యములఁ బట్టణము శోభిల్లెన్. ౩౦౦

సీ. కిన్నరీశ్రుతు లాలకించి పీడఁగలేము
సురసుందరులయాట చూచు టెపుడో
విబుధసంగీతముల్ వినుట మానఁగలేము
గాంధర్వసత్కళల్ గాంచు టెపుడో
దివిజబృందంబుతోఁ దిరుగ కాఁగఁగ లేము
భక్తసంఘంబుతోఁ బాడు టెపుడో
మునివరేణ్యులఁ జేరి మ్రొక్కకుండఁగలేము
శ్రీకృష్ణదేవుదర్శించు టెపుడో
అనుచుఁ బ్రజ లుత్సవాలోకజనితసంభ్ర
మాద్భుతానందపారవశ్యాత్ము లగుచుఁ
జూచినదె చూచి చేరినచోటె చేరి
విభ్రమించుచు నుండిరి విరతి లేక. ౩౦౧

గీ. అవనిపై దివ్యరథవాహనాళివలన
నాకసంబున సురవిమానాళివలన
భవ్యమణిధగద్ధగ లేవో, బాణసంచు
రవనిగన్నిగ లేవో యేర్పడక యుండె. ౩౦౨

క. ఊరేఁగుచుండె దివ్యా
కారుఁడు శ్రీకృష్ణమూర్తి ఘనవిభవముతో;
రారే! చూతము నెచ్చెలు
లారా! యని పిలుచుకొనుచు లలనలు వేడ్కన్. ౩౦౩

క. లీలాసదనాంతరములఁ
గేళీభవనాంగణముల గృహపార్శ్వములన్
జాలకముల నిలువంబడి
యాలోకింపంగఁ దొడఁగి రానందమునన్. ౩౦౪

సీ. నెమిలిపింఛమున వన్నెలు దీర్చునో యేమొ
తమకించి కనె నొక్క తరళనయన
కుండలంబుల మెఱుంగులు దేర్చునో యేమొ
తిలకించి కనె నొక్క లలితహాస
వనమాలికకుఁ గ్రొత్తవలపు చేర్చునో యేమొ
పులకించి కనె నొక్క పువ్వుఁబోణి
పొంబట్టుచేలపైఁ బూలు గూర్చునో యేమొ
తులకించి కనె నొక్క తోయజాస్య
త్రిజగతీమోహనాకృతి దిద్దునేమొ
యనిమిషత్వంబుఁ గనె నొక్క యబ్జపాణి
యఖిలమోహన శుభలీల లద్దునేమొ
పారవశ్యంబుఁ గనె నొక్క ప్రణయహృదయ. ౩౦౫

గీ. భువనమోహను శ్రీకృష్ణమూర్తిఁ గాంచి
భక్తి ప్రభవింపఁ బ్రణయంబు పల్లవింప
నగరసుందరతరుణీజనంబులెల్ల
విభ్రమాలోకనానందవివశలైరి. ౩౦౬

గీ. వైభవము మీఱ నూరేఁగి వచ్చుచున్న
యల్లుఁ డగుకృష్ణదేవు నత్యాదరమున
సర్వసామంతనృపులతో సర్వబంధు
హితజనముతోడఁ గేదారుఁ డెదురుకొనియె. ౩౦౭

సీ. ఐరావతము గాక యాశాగజము లెల్లఁ
గరియూథములతోడఁ గలసిపోయె
ఉచ్చైశ్శ్రవముగాక యున్న యశ్వము లెల్ల
హయసంచయంబుతో హత్తిపోయె
రంభగా కప్సరోరమణీగణం బెల్ల
వారసుందరులతోఁ జేరిపోయె
దిక్పాలకులు గాక దివిజసంఘం బెల్ల
క్షోణీసురులతోడఁ గూడిపోయె
వరవిభవలీలఁ బుర మేఁగి తరలివచ్చు
కృష్ణదేవునిఁ గేదారనృపవరుండు
ఎల్ల పరివారములతోడ నెదురుకొనఁగ
నిరు తెగలవారలును జేరి యేక మైరి. ౩౦౮

గీ. అడుగుదామర విమలగంగామృతంబు
అక్షిపద్మంబులను గరుణామృతంబు
గురియుచుత్రైలోక్యవిభునకు ధరణివిభుఁడు
పానకం బిచ్చి పూజించె భక్తిమీఱ. ౩౦౯

క. ఆదివిజప్రముఖులు నా
స్వాదించిరి దేవతాప్రసాదము గాఁగన్
భూదయితుఁ డిచ్చుపానక
మాదరమున నొసఁగునట్టి దమృతము కాదే! ౩౧౦

క. ఆచార్యానుమతిన్ లో
కాచారము ననుసరించి యల్లుని నపు డి
ష్టాచరణంబులఁ దనుపుచు
నాచక్రాంతక్షమాతలాధిపుఁ డెలమిన్. ౩౧౧

గీ. శుభసమారోహములతోడ నుభయపక్ష
బాంధవులతోడ భూరివైభవముతోడ
మన్ననలతోడఁ బరిణయమందిరమున
శ్రీవిభుని భూవిభుఁడు ప్రవేశింపఁజేసె. ౩౧౨

క. చతురగతులఁ గావించిరి
లతాంగు లపు డలరి మంగళస్నానంబుల్
చతురాననానుమతమున
శ్రితజనమందారుఁ డైన శ్రీకృష్ణునకున్. ౩౧౩

గీ. తల్లి శుభవల్లి యానందవల్లి యగుచుఁ
బెద్దముత్తైదువలతోడఁ బ్రేమ మీఱ
సేస లిడి చిన్నిబృంద నాశీర్వదించి
తానె చేయించె మంగళస్నానములను. ౩౧౪

ఉ. వీనులఁ గమ్మక్రొవ్విరులు
వెట్టి, మొగమ్మున బొట్టు వెట్టి, క
న్గోనలఁ జాఁదు వెట్టి, సిరి
గుల్కఁగఁ జెక్కునఁ జుక్క వెట్టి, నున్
వేనలి చుట్టి లేనగవు
వెన్నెలపువ్వులుగట్టి, యద్దమున్
జేనిడి, పెండ్లికూఁతురుగఁ
జేసిరి సుందరిబృంద నెచ్చెలుల్. ౩౧౫

క. మంగళవాద్యరవంబు లె
సంగ, విధిత్రిదశమౌనిసామశ్రుతు లు
ప్పొంగఁగఁ బరిణయపీఠము
నంగీకారంబు చేసె హరి శుభవేళన్. ౩౧౬

క. బ్రహ్మర్షులు దేవర్షులు
బ్రహ్మతపస్తేజులైన పరమమునీంద్రుల్
బ్రహ్మయుఁ బుణ్యాహంబుల
బ్రహ్మాత్మకుఁ గృష్ణుఁ దేర్చి ప్రణుతించుటయున్.

సీ. చతురాననుఁడు పురోహితుఁడుగా దేవర్షి
బ్రహ్మర్షులు సదస్యరాజిగాఁగ
శంకరప్రముఖనిర్జరులు బంధువులుగా
నార్యాదిసతులు పుణ్యాంగనలుగ
సకలదిక్పాలకుల్ సామంతనృపులుగా
సాగరుల్ వాహినీశ్వరులు గాఁగ
గంధర్వనాయకుల్ గాయకోత్తములుగా
నప్సరోగణము వారాంగనలుగ

బృందావనము.

విశ్వవిభవంబు దీపింప వెలసియున్న
కృష్ణదేవునిచరణ నీరేరుహములు
భర్మపాత్రంబునను జేర్చి ధర్మపత్ని
జలము లిడ నభిషేకించి జనవిభుండు. ౩౧౮

క. శ్రుతిసమ్మతముగ గంధా
క్షతములఁ బుష్పములఁ బూజఁ గావించి శుభా
న్వితవస్త్రభూషణంబుల
నతిముదమున నొసగి భక్తి నానతుఁ డగుచున్. ౩౧౯

క. ధన్యుఁడు సకలప్రభుమూ
ర్ధన్యుఁడు కేదారవిభుఁడు దైవతమణికిన్
మాన్యునకుఁ గృష్ణవిభునకుఁ
గన్యాదానంబు చేసె ఘనవిభవమునన్. ౩౨౦

ఆ. మఱియు సార్వభౌమమహితవైభవముతో
విబుధభూమిదేవవితతి కెల్ల
భూరిదక్షిణలను భూగోహిరణ్యాది
దానతతులఁ జేసి తనిపె నంత. ౩౨౧

ఆ. సకలదేవమునుల స్వస్తివాక్యములతో
విశ్వసమ్మతముగ విధిహితముగ
సాధ్విమైనబృంద సహధర్మిణిగ నెంచి
లోకనాథుఁ డెలమి స్వీకరించి. 322

ఉ. కట్టలు లేనియంబుధులఁ
గట్టఁగఁ, దారకలన్ గ్రహంబులన్
గట్టఁగఁ, గోటికోటిభువ
నంబుల నాకసమందు వ్రేలఁగాఁ
గట్టఁగఁ జాలుసూత్రములఁ
గల్పనఁ జేసినసూత్రధారి, తా
మట్టెలు వెట్టి మోదమున
మంగళసూత్రము గట్టె బృందకున్. 323

సీ. కల్యాణకౌముదీకళ యీవరారోహ
సౌభాగ్యమోహనచంద్రుఁ డితఁడు
వరరూపలావణ్యసరసి యీలలితాంగి
యానందమయరాజహంస యితఁడు

బృందావనము.

ఉద్యత్ప్రకాశవిద్యుద్వల్లి యీతల్లి
సంజీవజలధరశ్యాముఁ డితఁడు
శృంగారమధువన శ్రీదేవి యీదేవి
భువనప్రమోదమాధవుఁ డితండు

సార్వభౌముఁ డితఁడు చక్రవర్తిని యీమె
యితని కీమె యీమె కితఁడు తగుదు
రనుచుఁ బరిణయోత్సవానందచిత్తులై
ప్రస్తుతించి రఖిలపారిషదులు. 3౨౮

క. శ్రీకల్యాణానందో
త్సేకంబున సుప్రఫుల్లచిత్తాబ్జుండై
శ్రీకృష్ణుఁడు లీలాలో
కాకలనంబున దరస్మితాననుఁ డగుచున్. 3౨౯

సీ. పార్వతీపతి కిచ్చె బాలేందుమకుటంబు
రూపించి కడకంటిచూపుతోనె
భారతీపతి కిచ్చె భర్మాబ్జభవనంబు
తేలించి దివ్యాంగలీలతోనె

నాకాధిపతి కిచ్చు నవసుధాకలశంబు
మెఱయించి చిఱునవ్వుతరఁగతోనె
వాహినీపతి కిచ్చు వజ్రకంకణములు
సారించి పదవిలాసంబుతోనె

అఖిలపారిషదుల కభిమతార్థము లిచ్చు
సంగ్రహించి కేలిసన్నతోనె
క్రొత్తపెండ్లికొడుకు గోలోకనాథుండు
బృందప్రియముకొఱకొ! పేర్మికొఱకొ!! ౩౧౬

క. త్రైలోక్యాధీశ్వరు ని
ల్లాలై బృందమ్మ ధర్ముఁ డాత్మజుఁ డగుటన్
ద్రైలోక్యముఁ బాలింపఁగ
వాలాయము వర్ధిలంగ వరము లొసంగెన్. ౩౧౭

ఆ. ఆగమజ్ఞుఁ డైనయజ్ఞాసనుఁడు సల
క్షణము గాఁగ వేదసమ్మతముగఁ
బరమవైభవమునఁ బరిణయమంగళ
కృత్యములను నిర్వహింపఁ జేసె. ౩౧౮

బృందావనము.

క. బృందాకృష్ణులు శోభన
మందిరమును జేరువేళ మగువలు పరమా
నందమున నాఁగి వీనుల
విందుగఁ బేరులను జెప్పి వెడలుఁ డనంగన్. 3౨౯

క. శతకోటిమదనసుందరుఁ
డతివలు పరిహాసలీల నడుగ నడుగఁగా
స్మితవదనుఁ డగుచు బృందా
సతి యని వచియించె నెదుటిసకియలు నవ్వన్. 33౦

ఆ. చిన్నతనము మొదలు కన్నెతనముదాఁక
వేయుగతులఁ బలుకువిభునిపేరు
చెలువ లొక్కసారి చెప్పవే యన బృంద
చెప్పెఁ దొట్రునుడుల సిగ్గుపడుచు. 33౧

క. జిలిబిలిపలుకుల నీగతిఁ
జెలువ మగనిపేరు చెప్పఁ జెలువలు వేడ్కన్
గిలకిల నవ్విరి కృష్ణుం
డెలన వ్వొలయంగ బృంద నీక్షించెఁ దమిన్. 33౨

మ. సురమానిస్తుతికీర్తనంబులో, శుభ
శ్లోకంబులో, సన్మనో
హరసామోక్తులో, దివ్యగీతములో, వి
శ్వామోదనాదంబులో
మురళీమోహనభవ్యగానములో యే
మో యేమిగా దోఁచెనో
హరి కెంతో ప్రియమయ్యె బృంద తనపే
రర్థోక్తులం బల్కఁగన్. 333.

క. ఇవ్విధి జరపిరి చెలువలు
బువ్వపుబంతులును బెండ్లిప్రొద్దులపాటల్
పువ్వులబంతులయాటలు
నవ్వుల వేడుకలుఁ బెండ్లినాలుగునాళ్లన్. 334

గీ. తల్లి శుభవల్లి తండ్రి కేదారవిభుఁడు
కుందనపుఁబళ్లెరమ్మున గుమ్మపాలఁ
జిన్నిబృందమ్మ కెంగేలు చేర్చి యొత్తి
హరికరాబ్జంబునం దుంచి యప్పగించి. 335.

బృందావనము.

సీ. శ్రీపాదపద్మముల్ చింతించినది గాని
సేవించి యెఱుఁగ దీచిన్నికందు
వరనామమంత్రముల్ వల్లించినది గాని
పలికించి యెఱుఁగ దీయలరుపాప
అమృతాన్నపానంబు లర్పించినది గాని
యందించి యెఱుఁగ దీయాఁడుపడుచు
శ్రీమనోహరమూర్తిఁ బ్రేమించినది గాని
మన్నించి యెఱుఁగ దీకన్నతల్లి

నీవె లోకంబుగా భక్తిభావలీల
నలరి మెలఁగినయదిగాని యన్యమెఱుఁగ
దెఱిఁగి మాబిడ్డ నేరీతి నేలుకొనెదొ
సత్కృపాధామ దేవతాసార్వభౌమ. 336

ఆ. అనుచు జాలి గదుర నాదిగశ్చేశ్వరి
యైనబృందఁ జూపి యధికభక్తిఁ
బ్రార్థనంబు సేయుప్రభుదంపతుల జగ
త్ప్రభుఁ డనుగ్రహించి పలుకుటయును.

చ. అరదములున్ గజంబులు హ
యంబులు గోవులు దాసదాసికల్
పురములు హేమరత్నమయ
భూషలు భర్మదుకూలముల్ మణుల్
వరశయనాసనాద్యఖిల
వస్తులు బృందకు సర్వధారుణీ
శ్వరుఁ డరణంబుగా నొసఁగె
శారద మాధవినిన్ బ్రియంబుగన్. 330

క. సురవరులకు దిక్పతులకు
వరమునులకు శంకరునకు వనజభవునకున్
దరుణులకు నెలమి భూమీ
శ్వరమణి గావించె నుచితసత్కారంబుల్. 33౯

సీ. పరమభాగవతశేఖరుఁ డౌటనే కదా
బృంద కేదారునిబిడ్డ యయ్యె
భక్తివిశ్వాససంపన్న యౌటనె కదా
శ్రీనివాసుఁడు బృంద జెట్టఁబట్టె

సాధుసద్భక్తవత్సలుఁ డౌటనే కదా
　　సురగణం బతనితోఁ దరలి వచ్చె
బహుజన్మకృతపుణ్యఫలసిద్ధినే కదా
　　మనకు నీదివ్యదర్శనము దొరకె
అనుచుఁ బరిణయోత్సవములఁ దనిసి తనిసి
తాము ధన్యాత్ము లైనట్లు తలఁచి తలఁచి
బంధుగురుమిత్రసామంతపరిజనములు
పౌరజనములు నానందభరితు లైరి.　　　౩౮౦

క. తనిసెగి దివ్యోత్సవములఁ
దనిసెగి మృష్టాన్నపానదానాదులచేఁ
దనిసెగి సన్మానంబులఁ
దనియనివా రొకరు లేరు తలఁపున నైనన్.　　　౩౮౧

సీ. భవనంబు సర్వసౌభాగ్యవంతమె కాక
　　సర్వసుపర్వసంస్థాన మయ్యె
వంశంబు గుణగౌరవప్రశస్తమె కాక
　　దివ్యసంతానసంసేవ్య మయ్యె

ప్రాభవం బఖిలభూభారధుర్యమె కాక
త్రైలోక్యసన్నుతోదార మయ్యె
సద్ధర్మ మఖిలసజ్జనసమ్మతమె కాక
పరమేశబాంధవప్రథిత మయ్యె
సర్వమాన్య బృందాకన్యజనకుఁడైన
భక్తవరుఁడైన సత్త్వస్వభావుఁడైన
పుణ్యమయుఁడైన కేదారభూమివిభుని
కఖిలలోకేశ్వరుం డల్లుఁ డైనయంత. ३४२

క. ఈవిధిని బృంద త్రైలో
క్యావను శ్రీకృష్ణుఁ బెండ్లి యాడినవని బృం
దావన మని పేరొందెను
రావుకులపయోధిచంద్ర!రామనరేంద్రా! ३४३

క. రసికులరసనలకు సుధా
రసమై శ్రుతులకు మనోహరరసాయనమై
వసుమతి నీసత్కృతి పెం
పెసఁగుతఁ గృతినాయకున కభీష్టద మగుచున్. ३४४

బృందావనము.

మంగళమహాశ్రీ

శ్రీవిభుఁడు దేవమునిసేవితపదాంబుజుఁడు
శిష్టపరిపాలకుఁడు త్రైలో
క్యావనుఁడు పావనుఁ డనంతుఁడు కృపానిధి ని
రంతరముఁ గూరుచునుగాతన్
రాఘుకులదీపునకు రాజనిభతేజునకు
రామనరపాలమణికిన్ సం
భావితయశంబు మహిమంబును జిరాయువును
మంగళము మంగళమహాశ్రీన్. 389.

---

ఉ. వేంకటపార్వతీశ్వరక
విద్వయనిర్మలవాఙ్మనఃక్రియా
సంకలనంబునం బొడమి,
సమ్మతమై ఫలపుష్పశాఖికా
సంకులసత్కవిప్రకర
సాధునుతం బయి రామరాణ్మహీం
ద్రాంకితమైన యీ కృతిను
రాగమ మర్థులఁ దన్పుఁ గావుతన్.

126-8

రాబోవు నవల,

# కళ్యాణి.

నవరసభరితము—నవభావబంధురము.

నవ్యకథావిలసితము.

శ్రీవేంకటపార్వతీశ్వరకవిప్రణీతము.

